ప్రథమ ముద్రణము
సర్వస్వామ్యములు గ్రంథకర్తవి,
వెల : ప్రతి 1 కి రూ. 1-4-0.

## ఈ గ్రంథకర్త—ఇతర కృతులు

కుందమాల (దిఙ్నాగకవి నాటకమున కనువాదము
మదరాసు-ఆంధ్ర — మైసూరు విశ్వవిద్యాలయ
పట్టపరీక్షలకు పాఠ్యగ్రంథము.) ... రూ. 2-0-0
సుభాషిత రత్నమాల (పద్య) ... ,, 0-6-0
శ్రీ రామ—లక్ష్మీశ్ర స్వభావము (పద్య) ... ,, 0-6-0
ఆంధ్ర పాండవగీతలు (పద్య) ... ,, 0-6-0
భామినీవిలాసము (పండితరాజ జగన్నాథకృతి కనువాదము :
శ్లోక సహితము) ... ... ,, 3-0-0
శస్త్ర విమర్శనము (గద్యము) ... ,, 1-0-0
భక్తికల్ప శతకము (సీసములు) ... ,, 0-8-0
శిష్యనీతి బోధినీ శతకము (కందములు) ... ,, 0-3-0
భక్తవత్సల శతకము (ఏకప్రాస చంపకములు) ,, 0-5-0
తేనె సోనలు (సాంఘిక, రాజకీయ, భక్తి, శృంగారాదిక
నాటు పద్యగేయములు) సంపుటము : 1 ... ,, 1-4-0
తేనె సోనలు (ఖండకావ్యములు) సంపుటము : 2 ,, 1-4-0

## అచ్చులోనున్న గ్రంథములు

విష్ణుమహామాయావిలాసము (పద్యములు)
సుహోశమాలా (సంస్కృత శ్లోకములు)
పద్మప్రాభృతకము (శూద్రకకవి భాణమున కనువాదము)
నెహ్రూ కావ్యము (పద్యములు)
శతకవాఙ్మయము (మొదటి సంపుటము)
తేనె సోనలు (సంపుటము : 3)

ప్రతులకు :
విద్వాన్ వేదము వెంకటకృష్ణ శర్మ,
66, సామిపిళ్ల వీధి, చూళై, మద్రాసు-7.

# అర్పణము

కుందమాలను దాల్చు నానందమూర్తి,
భామినిం గేలుపట్టిన ప్రణయమూర్తి,
ధనుఃభంగనిమిత్తావతారమూర్తి
శ్రీపతియు, 'తేనెసోన' లక్ష్మిలి గ్రహించు.

# విషయావళి

# మనవి

చాటువులు, ప్రాస్తావికములు, ఖండకావ్యములు — మున్నగు వానిలోఁ బోయినవి పోఁగా, మిగిలినవాని— ‘తేనెసోన’ —అనుపేర, విషయ విభాగముల ననుసరించి మూఁడు ‘మధుకోశములు’—గ వెలువరింప నెంచితిని. ఇందిది తొలుతటిది.

ఇందలి ‘తేనెసోనలు’—చాలవఱకు లోఁగడ పత్రికలలోఁ బ్రకటితములే. ఆయా పద్యములచివర — నట్టి పత్రికలఁ బేర్కొంటిని. ఇఁక నిందలి ప్రసాదమాధుర్యాది గుణనిర్ణయమునకు సరస విమర్శకనికరమే పరమ ప్రమాణము.

ఈ కృతి—యిట్లు సర్వాంగ సుందరముగ వెలువడఁ గారకులయిన ‘శాయినాథ్’—ముద్రాశాలాధికారులు, ‘మాతృసేవ’ సంపాదకులు, మన్మిత్ర వరేణ్యులు—శ్రీ ఇరువంటి శ్రీధరరావు, ఎ. యమ్. ఎ.. (ఇంగ్లండు) ఎ. యమ్. ఐ. ఇ. — గారికిని; —బహుళకార్యాంతర నిమగ్నులయ్యు, . సభ్యర్థించిన వెంటనే— ‘సమవలోకనము’— వ్రాసి యొసంగిన—శాసన పరిశోధకపితామహులు —చారిత్రక సమ్యగ్వ్యాలోకనులు —శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారికిని, ముద్రణమున కార్థిక సహాయ మొసర్చిన రసికావతంసులగు—భాషాభిమానులకును నాహృదయపూర్వక కృతజ్ఞతాభివందనములు.

చూళై—మదరాసు
20_11_1952

ఇట్లు— భాషాజీవి
వేదము వేంకటకృష్ణశర్మ

# సమవలోకనము

"మధుకోశ" మను రసవంతమైన యీ గ్రంథమును రచియించినవారు ఇదివఱకే తెనుఁగు పాఠకలోకమునకు సుపరిచితులైన సుప్రసిద్ధులు విద్వాన్ బ్రహ్మశ్రీ వేదము వేంకటకృష్ణశర్మగారు. వారు ఆయాయివిషయములను గురించి తమ కెదనెదఁదోఁచిన భావములను పద్యరూపమునను, గేయ రూపమునను వ్యక్తము చేసినారు. "భారతీ! కవితాలత కాధార" మని వాణీ స్తుతిలో వీరు వ్రాసినారు. ఆవాణీ "కృపాసుధారసధార" వలన నాధారా వీరి రచనములలోఁ— పద్యములలోఁగాని గేయములలోఁగాని— యెుక్కడను గొఱవడలేదు; కుంటుపడలేదు; దివ్యమయిన గంగాప్రవాహమునవలె నడ్డంకులు లేక సాగిపోయినది. వీరికిఁ బద్యములు చెప్పుటలో నెంతటి ప్రజ్ఞ యున్నదో గేయములు రచియించుటలోను నంతటి నిరుపమమైన నైపుణ్యమున్నది. వీరు రచియించిన గేయములు చదువుటకు నింపై చక్కని భావసంపదతోను, తదనురూపమైన పదలాలిత్యముతోను సొంపుగొలుపుచు హృదయంగమములుగ నున్నవి.

ఈ "మధుకోశము" లోని విషయములు బహువిధములైనవి. మొదటి నాలుగును దైవస్తోత్ర సంబంధమైనవి; మిగిలినవానిలో రాజకీయ, శృంగార, దేశాభిమాన, నీతిబోధాత్మకాది విషయములు కలవు. ఒక్కొక్క విషయమును గురించిన ఖండకావ్యము తేనెసోనలు కురియు నొక్కొక మధుకోశపుటరయే. ఇందలి ప్రతిపద్యమును రసభావబంధురమై మనస్సును రంజింపఁజేయుచున్నది. ఇందలి కవిత్వపుశైలి ద్రాక్షాపాకరుచిరమై ప్రబంధఫక్కిని నడచినది. ప్రయోజనకరములు, సుచితములు నని తోఁచినపుడు శర్మగారు అన్యభాషా పదములను వాడుటకు జంకలేదు. ఆపదము లన్యదేశ్యములైనను నొకవిధమైన యందమును గూర్చి పద్యమునకు శోభ తెచ్చినవి.

ఈ "మధుకోశము" నందలి పద్యఖండికలలోఁ గొన్ని "బుద్ధి"కై జాగ్రత్తగా శోధించుకొనవలసినవి; మఱికొన్ని "తేలిక"గాను చదివి యానందింపవలసినవి; ఇంకఁగొన్ని సావధానముగఁ బఠించి మననము చేసికొనవలసినవి. ఇందలి కావ్యములన్నియు నొకరకమైనవి కావు; ఒక్కతెఱఁగువి కావు; ఒక్క ప్రయోజనమునకైనవి కావు.

‘విద్యార్థిని’, ‘క్రీడాసక్త’, ‘దేవదాసి’, ‘జారుఁడు’, ‘శాస్త్రి’, ‘కాని కాపురము’, ‘నల్లి’ యనునవి వర్ణనాబహుళము లైన లఘువృత్తములు.

పద్యరూపమైననేమి, గేయరూపమైననేమి రాజకీయములైన ఖండకావ్యములందలి ప్రతిచరణమును శ్రీ శర్మగారప్పటప్పటి రాజకీయపరిస్థితుల ప్రభావమునఁ బలికినదే. ‘శ్రమజీవి’, ‘ఏమండీ?’, ‘దొరతనమా?’, ‘రామరాజ్యము’, ‘ప్రళయఘోష’, ‘తెలుగూభాయ్’, ‘జయరాజారాం’ అను కావ్యములలో శ్రీ శర్మగారియావేదన, భావోద్వేగము అచ్చుగ్రుద్దినట్లు పొడకట్టి యాకావ్యములకొక యనూనగౌరవము నాపాదించినవి. అందలి భావనే తదుచితమైన భాషారీతులను మలచుకొన్నట్లు కనిపించుచున్నది.

‘ఏమండీ?’ యన్న గేయము అసద్స్వార్థపరాయణుఁడైన ప్రతి కాంగ్రెసువాని హృదయమును గలఁచివైచి యాతని నాత్మపరీక్షోన్ముఖునిఁ గావింపఁగల ‘బ్రహ్మగీత’మే.

“జైలు కెడితే జన్మవాసన చచ్చిపోయిందా
ఖాది గడితే లోనివిషమూ కాలిపోయిందా
తెల్లటోపీ పెడితె మెదటిక్రుళ్లు పోయిందా
జాతి తండ్రి ప్రతిష్ఠ చెడిపీ
నీతినీమాల్ గంగ గలిపీ
గోఁత పనులూ చేతు రేమండీ?”

లేదు, కాదు అని ఈ కవివరేణ్యునికి గుండెల మీఁదఁ జేయివైచికొని యెందఱు నిబ్బరముగా నా ప్రశ్నకు సమాధాన మీయ గలరు?

శ్రీ శర్మగారి గేయములలోను, పద్యములలోను నున్న విశిష్టతే మేమన సూటిదనము. శ్రీ శర్మగారు గుండెలోఁ దగులునట్లు రామబాణము వలె సూటిగా లక్ష్యము చెదరకుండఁ జెప్పఁగలుగుట విశేషము; వంకరటింకర పదములును డొంకతిరుగుడుమాటలు నేవియు నుండవు. అందువలననే యవి పద్యమైననేమి, గేయమైననేమి, ప్రతిచరణమునకు బలమధికము; పదనెక్కువ. వీరి గేయములలోని మఱియొక విశేషమిది: ప్రతి చరణమును యతిమైత్రినో ప్రాసమైత్రినో పురస్కరించుకొని నర్తనముచేయునర్తకి యభినయపుకోపును బోలి చిక్కని లయకట్టు గలిగి పాడుటకుఁ జక్కనై

వినుటకు మనోహరముగా నుండును. ఇందులకన్ని గేయములును, ముఖ్యముగా 'ఆస్థానకవి'యుఁ దార్కాణము. ప్రభుత్వపరిపాలనము దోష భూయిష్ఠమై దుర్భరముగ నున్న యీకాలములోఁ బూర్వోక్తకావ్యములు ప్రచారయోగ్యములు; అవి యెవనికి వాఁడు నిరంతరము మననము చేయఁ దగినవి. శ్రీ శర్మగారు వీటిని రచించి జనబాహుళ్యము హృదయములోఁ గొట్టుమిట్టాడుచున్న మూఁగభావములకుఁ బ్రాణముపోసి గొంతునిచ్చి వ్యక్తీకరించినారనవచ్చును. కవులలోనైనను ఒక భావమును పరిస్ఫుటముగ గీటుగీసి చూపినట్లు లతిమార్దవముగ, నవకముగఁ, గోమలముగ, సుబోధ ముగాఁ జెప్పఁగలశక్తి చాలమంది కుండదు.

దేశాభిమాన ముద్దీపింపఁజేయు పద్యరత్నము లిందనేకము లున్నవి. రాయలసీమవాస్తవ్యులైన శ్రీ శర్మగారి హృదయము ఆసీమను దలంచు కొన్నపుడుప్పొంగిపోవుటలో నాశ్చర్యములేదు. ఇందువలననే రాయల సీమను గుఱించిన యిందలి పద్యములు సానలు దీరిన జాతిరత్నములవలెఁ బ్రకాశించుచుఁ జదివినకొలఁదిఁ జవులూరించుచున్నవి. ఆసీమను వర్ణించునపుడు శ్రీ శర్మగారి హృదయతంత్రువులు మధుర మనోజ్ఞధ్వను లనుసరించినవి. ఆపద్యములను జదువునపుడు ఆమనోహర మంజుల రవములు మనకును విన వచ్చుచునే యుండును; మన హృదయమును బ్రతిస్పందించుచునే యుండును. ఇంతకు రాయలసీమ ఒక్క రాయలసీమవారిదే కాదు; ఆంధ్రదేశీయు లందఱిదియును. అది త్రిలింగదేశపు విభాగమేకదా. ఆపద్యములను జదువు నపుడు మలయమారుతపోతములవలెఁ బురాతన మధురస్మృతు లేనాఁటివో కలలోవలె హృదయ మెలయించి యానందమును గలిగించును.

కడప, కర్నూలు (కందనవోలు— కందనూలు— స్కందపురము) మొదలైన మండలములకు రాయలసీమ యన్నది చాలమంది యనుకొనునట్లు క్రొత్తపేరుకాదు. అత్యంతపురాతనమైన 'ఱేనాఁ'టి కది పర్యాయపదము. 'ఱేనాటిని రేనాడని వ్రాయుట యాచారమైనది. రేగడమట్టిదేశము గనుక ఈ ప్రాంతమునకు రేనాడని పేరుగలిగినదనుట పొరపాటు. క్రీస్తుశక మేడవశతాబ్ది నుంచి యీ ప్రాంతమునకు రేనాడనుపేరు చెల్లుచుండెను. 'ఱేఁడనగాఁ బ్రభువు, రాజు; రేనాడన 'ఱేండ్లదేశము (రాయలసీమ). క్రీస్తుశకము తొమ్మిదవ శతాబ్దినుంచి రేనాడను దేశనామము సామాన్యజనానికి ఉదుముగా

మహారాజరపాడు, మహారాజపాడి, మహారాజవాడి యను నామములు కలిగినవి. పాడి, వాడి యనుపదములు దేశవాచకములు. కొందఱన్న వట్టి రాజులు కారు; మహారాజులే. మహారాజపాడి, మహారాజవాడి యను శబ్దములు జనవ్యవహారమున నపభ్రంశమునొంది మహారాయపాడి, మారాయపాడి, మారాజవాడి, మార్జవాడిగా మాఱినవి. క్రీస్తుశకము పదుమూడవ, పదునైదవ, పదునాఱవ శతాబ్దులనాఁటి శిలాశాసనములలో మారాయపాడి, మార్జివాడి పదములే మనకుఁ గానవచ్చును. విజయనగర సామ్రాజ్యాధీశ్వరులైన శ్రీ కృష్ణదేవరాయ, అచ్యుతదేవరాయ, సదాశివదేవరాయ మహారాజాధిరాజుల కాలములో నీదేశ ముదయగిరి మార్జవాడియని, పెనుకొండ మార్జవాడియని రెండు విభాగములుగా నుండెను. ఉదయగిరి నెల్లూరు మండలములోనిది; పెనుకొండ అనంతపురము మండలము నందలిది. అందువలన నీప్రదేశమునకు రాయలసీమ యన్నపేరు క్రొత్తదికాదు; ప్రాఁతదే; కాని రూపము మాఱినది. ఈ సీమ కీ పేరు వచ్చుటకుఁ గారణము క్రీస్తుశకారంభ శతాబ్దులలోఁ దెనుఁగుదేశము నంతను నేకచ్ఛత్రముగఁ బరిపాలించిన ఆంధ్ర శాతవాహననృపతులనియే నాయూహ. ఇఁక నీ విషయమును గుఱించి యింతకంటె నెక్కుడుగాఁ జర్చించుట యనవసరము. రాయలసీమ యన్న పే రీ దేశమునకుఁ గ్రొత్తదికాదని తెలుపుటయే నా యుద్దేశము.

‘హితబోధ’యన్నది ‘సర్కార్ల’కు ‘రాయలసీమ’ చేయు హితబోధ.

“వన్నెయు వాసియుంగలుగువారల రాయలసీమవారిఁ దూ
ర్పన్నలు గోడివారలని యాత్మఁ దలంపరు చూతురెంతయుఁ
జిన్నతనంపుఁ జూపుల...”

అనుటలో శ్రీ శర్మగారు తక్కువ మంది పైననేమి యెక్కువమంది పైననేమి రాయలసీమవారి యభిప్రాయమును వ్యక్తము చేయుచున్నారు. వారు:

“ఏమిటం దక్కువైతిమి మేము మీకు
సవతితల్లి ప్రియానఁ గాంచంగ మమ్ము ?

అని సర్కార్లవారిని సూటిగా నడుగుచున్నారు. రాయలసీమ వారెందునను తక్కువవారు కారనుటకు రాయలసీమ యాధిక్యమును సోపపత్తికముగ నిరూపించినారు.

నిజమే— సర్కారులలోని రాజకీయనాయకుల యసంగత, అనుచిత ప్రవర్తనమువలన రాయలసీమవారికిని సర్కారులవారికిని విభేదము లేర్పడినవి. నాయకమ్మన్యు లుచితానుచిత విచక్షణ లేకుండ నప్పుడప్పుడు చేయుచుండు నభిభాషణములవలన నుభయసీమలవారికిని బొరపు లధికమైనవి; ఇంకను నధిక మగుచున్నవి. ఇది చాల విచారకరమైన విషయము. ఈ భయములను నీ విధమైన పొరపులును, విభేదములు నుండుట యటు రాయసీమకుఁ గాని యిటు సర్కారులకుఁ గాని— మొత్తము తెలుఁగుదేశమునకే శ్రేయస్కరము కాదు; అభ్యుదయ నిరోధకమే. సర్కారులవారు రాయలసీమవారిని జిన్నచూపునఁ జూచుటయు దగదు; రాయలసీమవారు తాము సర్కారులవారికంటెఁ దక్కువవారముని భావించుకొనుటయుఁ దగదు.

రాయలసీమ ఇప్పుడన్నివిధములఁ బేదవడియున్నను బూర్వము మహా వైభవము ననుభవించిన దేశము; సర్వసంపత్సమృద్ధమైన ఖండము. ఇక్కడ మహాకవు లుద్భవించినారు; ప్రతాపవిక్రమాదిత్యులైన మహారాజులు రాజ్య మేలినారు; శిల్పకళా సంపదలో 'విజయనగరశిల్ప' యను నొక చక్కని కళా సంప్రదాయమును వెలయించిన కళానిపుణులకిది యాటపట్టు; ఏ విషయమున నీదేశ మితరాంధ్రమునకుఁ దీసికట్టు గాదు; కొన్నిట నిది యితరప్రాంతములకన్న మిన్నయే. అయితే, ఈనాఁడీదేశము పేదవడియుండుటకు నాకుఁ బ్రధానకారణములు రెండు తోఁచుచున్నవి: (౧) ఆర్థికముగా వెనుకఁబడి యుండుట; (౨) విద్య తక్కువగ నుండుట. ఈ రెండు లోపములను దీర్పవలసినది, తీర్పఁగలిగినది ప్రభుత్వము. ఇంతవఱకు మద్రాసు రాజధానిలో నందరితోపాటుగ నుమ్మడిగాఁ గలసియుండుటవలనఁ గలిగిన యనుభవమునుబట్టి చూడఁగా ఆంధ్రరాష్ట్రము లభించిననే కాని యంధ్రదేశమునకు, ముఖ్యముగా రాయలసీమ కభ్యుదయము చేకూరదని నా నమ్మకము. ఆంధ్ర రాష్ట్ర మెంత త్వరలో లభించినఁ దెనుఁగువారి కందఱికి నంతమేలు. ఈ విషయమును గుర్తించినవారు రాయలసీమవారిలో ననేకులున్నారు. వారిలో శ్రీ వేంకటకృష్ణశర్మగారొకరు. వీరిట్లు వినుఁడు వాపోవుచున్నారు —

"అక్షయదీక్ష రాష్ట్రమునకై మన మెల్లరుఁ గూడ నిల్వ నా లాత్మునకైన నడ్డుపడనౌనె? తలంపుడు..."

ఇది పరమసత్యము. అందువలననే వారు

"......... పక్షపాతపుణ
వీక్షణములు విడుండు; మము వేఱుగ నెంచుపండయ్య..."

అని సర్కారువారికి హిత ముపదేశించి

"..........సోదరుల్
ప్రత్యక్షమబుద్ధిఁ గష్టసుఖపాళిని బాల్గానువార మెప్పుడున్."

అని వ్రాసచేయుచున్నారు. సర్కారువారు ఈ కవిశేఖరుల హితవు నాలించి రాయలసీమవారికి విశ్వాసపాత్రు లగునట్లు ప్రవర్తింతురు గాతమని కోరు చున్నాను.

'ఆంధ్రరాష్ట్ర'మను గేయములో శ్రీ శర్మగారు మన పరిస్థితిని చక్కఁగా వివరించినారు.

"స్వార్థపరులై పదవులకు మన
వారు తల్లిని విడిచిరన్నా"

యనునప్పుడును,

"రాష్ట్రపతులును రాష్ట్రహితులును
రాష్ట్రమునకు విరోధు లాయన్నా"

యనునప్పుడును,

"తెలుఁగు నెత్తురు తెలుఁగు తేజము
నిలుపునాయకు లేగిరన్నా"

యనునప్పుడును శ్రీ శర్మగారు సత్యమే నుడువుచున్నారేమో యనిపించు చున్నది.

'ప్రబోధము' యావదాంధ్రధరణికిని రాష్ట్రియ విషయమున దివ్య ప్రబోధమే. ఇందలి ప్రతి పద్యమును తెనుఁగు గడ్డను బుట్టిన ప్రతి ఆంధ్రుని హృదయ తంతువులను గదలించి యుత్సాహమును నూలుకొల్పి వానిని కార్య పరతంత్రునిగ దిద్దఁగల శక్తిసముపేతమైనది. 'రాయలసీమ', 'హితబోధ', 'ఆంధ్రరాష్ట్రము', ప్రబోధము' అను దేశాభిమానవిశిష్టములైన యీ నాలుగును నాలుగు మంత్రోపదేశములే.

ఇవి యవి యని వేర్వేఱఁ బేరు పేరునఁ బేర్కొనుట యెందుకు? పల్లికాకుసుమవిసరములలో గుణవిభేద వివక్ష యేమిటి? అన్నియు నొక్క కీతినున్న యనర్ఘరత్నములే. పదముల జిగిబిగి కూర్పు, చక్కని లాలిత్యము,

# శ్రీపతి

ఐహిక భోగ కాంక్షలు యు
గాంతముదాఁక నశింప, దాత్మ కు
త్సాహము నీదు తాత్త్వికుల
సంగతి, యొక్కనిమేషమేని నీ
యూహ మనంబునం గలుగ
దూరక జీవిత మిట్లు పోవ, సం
దేహమకాదె నీ కృపకు
నే నిఁకఁ బాత్రుఁడ నౌట శ్రీపతీ! ౧

వయసా, చెల్లుచునుండెఁ; — సత్యపరత
త్త్వ జ్ఞానమా, కల్ల దిం
తయు; సంసారపుఁ జింతయా, పెరిఁగె; నా
త్మ శ్రేయపుం ద్రోవయా,
లయమయ్యెన్; మమకారమా, యెదిఁగె; లీ
లా లోలమా చిత్తమా,
నయవృత్తిం జరియింప, దెట్లిఁకను, నిన్
దర్శింతునో? శ్రీపతీ! ౨

ఆసకు మేర లేదు, వికృ
తాత్మనియంత్రణ చింత లేదు, నీ
ధ్యాసయె పట్టలేదు, పర
ధర్మ సమాదరబుద్ధి నీడ లే,

దీనున నన్ను మార్గముల
నెగ్గులు సూపుట మానలేదు, నా
దోసము లెన్నియో కల, న
ధోగతిఁ ద్రోయక కావు శ్రీపతీ! ౩

భవదీయాజ్ఞ, నొకింత లేక యొకలే
ప్రాణుల్ స్వజీవానుగా
ల విధుల్ పూని, యిహంబున న్మెలఁగు ? నీ
లక్ష్యంబు లేకెట్లు వై
భవముల్ సేకుఱు ? మానవాళికి, నిటుల్
త్వచ్చిత్తి మింతేని లే
క విధం దేహము నెట్లు చిన్మయయినన్!
ఖాన్మమండలిన్ శ్రీపతీ! ౪

పరమార్థం బెదో, సత్యమెయ్యదో, మహా
త్త్వంబైన తత్త్వం బెదో,
స్థిర శాంతి ప్రదమెయ్యదో, ముని మన
శ్చింతామృతం బెయ్యదో,
సిరతామ్నాయ విధేయ్య మెయ్యదో, విని
ర్నిద్ర ప్రభాజాల సం
భరితం బెయ్యదో, దాని, వేంకట పదా
బ్జాతి ద్వయిం గొల్చెదన్. ౫

# దేవా!

దేవా! ప్రేమజ్యోతివి,
నీ వలనఁ వెడలి దీప నికరము లెన్నో,
యీ విశ్వ మాక్రమించుట
చే, వెలుఁగుఁ దాని ప్రభ విచిత్రముగాఁగఁ॥ ౧

దేవా! ప్రేమ సదంబవు
నీ వలనఁ జిన్న నదులు నిగిడి, జగమ్ముం
గావించుట నార్ద్రిత, నీ
భూవనిత యెసంగె సస్యపుం బుల్కలతోఁ॥ ౨

దేవా! ప్రేమ జ్యోత్స్నవు,
నీ వెలుఁగుల రేక లెన్నొ నిండి జగతి ను
జ్జీవన నిత్యానంద
శ్రీ వెలయించుటను గళలఁ జెలఁగెడు నెపుడుఁ॥ ౩

దేవా! ప్రేమయె నీవో,
నీవే యాప్రేమయో గణింపఁగలే, కె
న్నే వివిధయోగ సరణుల
భావింతురు తత్త్వ మెఱుఁగఁ బ్రాజ్ఞులు నిన్నుఁ. ౪

దేవా! తెలిసీ తెలియని
త్రోవల నీప్రేమమహిమ దొరకమి, నజ్ఞుల్
చేవసెడి శ్రమలఁ గుములుదురు
గా, వారి మరుస్థలాలఁ గాంచఁగ వశమే? ౫

దేవా! ఆత్మాలోకము
హా వైభవ సిద్ధి, సచ్చిదానందంబౌ
నీ విమలప్రేమఁ గనం
గా వశమగుఁ, బెఱవిధములు గడగండ్లకెగా॥ ౬

— (ఆంధ్రవాణి— 7–4–1951)

---

# వాణి

శ్రీ రమణీ రమణీయో
దారకృపా సాంద్ర దృగ్వితానముఁ గనుఁ, న్న
త్కారుణ్య పాత్రుఁ డెవ్వఁడు
వారిజభవురాణి! మధురవాణీ! వాణీ!

భూరితపో మహి తాదిమ
సూరులు వల్మీకజాత సుకవితతి ముఖుల్
సారెకు నినుఁ గొల్చిరిగా,
వారిజభవురాణి! మధురవాణీ! వాణీ॥

సారెకుఁ ద్వత్సత్కారుణా
సారము గను, టది వినా, యసారము పెఱు, సం
సారమునందు జనాళికి
వారిజభవురాణి! మధురవాణీ! వాణీ!

వారిజ విశిఖారికినే
వారిజనయనునకు నేని వారిజజున కేఁ
వారిజముఖి! నీవే గతి
వారిజభవురాణి! మధురవాణీ! వాణీ!

మారుఁడు రతికళ, నీదు కు
మారుండు సంగీతముం, గుమారుండు బలముక్
మా రుసుగఁ, గనిరి, త్వత్కృప
వారిజభవురాణి! మధురవాణీ! వాణీ! ౫

ధారయె కవితాలత కా
ధారము, నది నీ కృపా సుధారస ధారా
ధారం, బది నా కొసఁగుము
వారిజభవురాణి! మధురవాణీ! వాణీ! ౬

సారము లాఁజ, వికార మ
పారముగాఁ దాఁచు గ్రంథ వారము మీాఁదెక్
భారము నీ కారయ నది,
వారిజభవురాణి! మధురవాణీ! వాణీ! ౭

సారము, నిస్సారముఁ గన
నేరని ధీశాలి ధారణిం జేరె నహా!
కేరుచుఁ బూర్వ కవీంద్రుల.
వారిజభవురాణి! మధురవాణీ! వాణీ! ౮

చారుసుధా సారకథా
పార విధాన ప్రబంధ వర నిర్మితి, నీ
కారుణ్యంబునఁ గనుఁ గవి
వారిజభవురాణి! మధురవాణీ! వాణీ! ౯

—(త్రిలిఙ్గ – 12–5–1952)

# దేవి

శ్రుతి రహస్యంబులెల్లను వెతకి వెతకి,
ప్రకృతి పౌరాణివౌ నిన్ను, భవుని గూప
ముద్రగా మదినెన్నుచు మునులు గొల్తు
దేవి! నిను శరణంటి; నా దిక్కునీవ. ॥ ౧

అంబ! నిను నుతి సల్పఁ బ్రయత్నపడఁగ
నా వచో గుంఫనంబు వణంకఁ దొడఁగె
బాలకుఁడ, నానుడుల రసభావమున్నె ?
ఎట్లొ నను బ్రోవు వాత్సల్యహృదయవగుచు ॥ ౨

గగన మట్టులు, బిందువు కరణి, నాద
మట్లు, కళరీతి, రూపంబు నట్లు, వాక్కు
నట్లు, మేన్వోలె, మాతృకయట్లు, హృదిని
బరఁగు కాంతిని గాంతురు, భాగ్యయుతులు ॥ ౩

—(ఆంధ్ర పత్రిక: ప్రభవ - పుష్యశుద్ధము, సోమవారము)

# వాసవి

శ్రీ రమామణి నీవె, శంకర
చిత్తహారిణి నీవె, యా
శారదాసతి నీవె, వైష్ణవ
శక్తి నీవె, జగత్త్రయా
ధారనీవె, చరాచరావన
తంత్ర నీవె, తదంతకృత్
కారణంబవు నీవె, వాసవ
కన్యకా పరమేశ్వరీ! ॥ ౧

చండశాసన మిా వానర్చితి
సర్వలోక విధాత, బ్ర
హ్మాండము ల్గలిగింప, విష్ణుఁడ
నన్యదీక్షను బెంప, రు
ద్రుండు సంహారణం బొనర్ప, వి
ధు ప్రభాకర పావకా
ఖండ తేజము లొప్ప వాసవ
కన్యకా పరమేశ్వరీ! ॥ ౨

---

# మనసా !

ఒనరం గల్గినా సంసృతి వ్యసన దు
ర్యోగ వ్యపేతస్థితుల్ ?,
తనరం జోవునా సంచితాత్మ చిదచి
త్తత్త్వార్థ చింత ల్సదా ?,
పొనరన్నేర్చునా నిత్యమోక్ష సుఖముల్ ?,
మోహంపుఁ జిక్కేలనే ?
మనసా ! మానుము, మిద్దెమీఁది పరుగుల్
మానాథు సేవింపుమా ! । ౧

అనుమానంబిఁక నేల ? యైహిక సుఖ
వ్యామోహ మెన్నాళ్ళకుఁ
జనఁ జోదం, చనుభూత మయ్యును, దటి
చ్చాంచల్యమా జీవితం
బున విశ్వాసముఁ జూపుచు న్నలఁగుటల్
మూర్ఖత్వమే కాదె, యో
మనసా ! మానుము మింటి చూపుఁబోగరుఁ
మాకాంతుఁ బ్రార్థింపుమా ! ॥ ౨

అనువౌ నైహిక భోగ భాగ్యములు స్వా
త్మార్థంబ యంచెంచి, దు
ర్వ్యసయానం బసులల్గా తక్కుజనులం
బీడించి, తద్ద్రవ్యముల్

గాన, నెన్నో కపట క్రియల్సలుపు నీ
ఘోరాఘముల్ చాలిఁకన్
మనసా! మానుమ, కండక్రొవ్విన పనుల్
మాహృద్వరుం గొల్వుమా॥

ఒనర న్నీలపు నీరదాంతరిత వి
ద్యుల్లేఖ నా, నివ్వెరిం
దనురూపంబునఁ గ్రాలు శోకమటు, హృ
త్పద్మమ్మున న్వెల్గు ప
చ్చనికాంతు ల్గల దివ్యతేజ, మది సం
స్తవ్యమ్ము గుర్తింపుమా,
మనసా! మానుమ నిక్కి నీల్గి పకుటల్
మాభర్త ధ్యానింపుమా!॥

ధనగర్వంబు, వయోమదంబు, తను సౌం
దర్యావలేపంబు, వా
హసమాన్యావని దర్పముం, బరిజనా
హంకారము, స్సత్కళా
ఘనతాటోపము, రాజ్యదంభ, మివి మో
క్ష ప్రాప్తికిం ద్రోవలా?
మనసా! మానుమ కన్నుమిన్నెఱుఁగమిన్
మా హృద్విభున్ మ్రొక్కుమా!

అనివార్యంబగు కామముం గెలిచి, క్రో
ధావేశము న్వీడి, లో
భనివృత్తిం బొనరించి, మోహ పరతన్
వర్జించి, మెండౌ మదం
బును గోఁద్రోలి, త్యజించి మచ్చరము, నె
ష్ఠో శాంతిఁ గైకొంటి, యో
మనసా! మానుమ డంబపున్నడత, నా
మాదేవుఁ గీర్తింపుమా! ॥ ౬

వసధుల్వ్రాంగిన, సప్త గోత్ర నగముల్
'పట్లీల్' వెసం గొట్టినన్
వనులం దావము లేర్చినన్, జనపద
వ్రాతంబుఁ బాడైనఁ, బ్రా
ణినికాయంబు నశించినన్, మొలఁగనౌ
నే, నీకు నిశ్చింతమై?
మనసా! మానుమ నీ విజృంభణము, లా
మాదేవుఁ గీర్తింపుమా? ॥ ౭

'మును జన్మంబునఁ జేసినట్టి సుకృతం
బో, దుష్కృతంబో, యిహం
బున నిచ్చున్ ఫలితంబు జీవి,'-కని చె
ప్పున్ శాస్త్రముల్, కాన, నే

లనె పాపంబు లొనర్చి, వచ్చు జనిఁ బల్
కష్టంబులం బొందె, దో
మనసా! మానుము, మిట్టిమిట్టి పడుటల్
మావల్లభు న్వేడుమా? ॥

---

# రాయలసీమ

రాయలసీమ గడ్డపయిఁ
    బ్రస్తుతిఁ గాంచెడు శౌర్య సాహసా
జేయులు, సత్య ధర్మ శుచి
    శీల సమేతులు, శాంతి శిక్షణా
దేయులు, విద్వాదార్య సువి
    ధేయులు, దీన జనావన క్రియో
పాయులు పుట్టుచుందురను
    పల్కులు నేఁటివె? — నాఁటివే సుఁడీ! ॥ ౧

కపటములేని వర్తనము,
    కర్కశ భావము లేని చేఁతలున్,
నెప మిసుమంత లేని కృప,
    నేరము లెన్నఁగలేని మైత్రియున్,
అపజయమెందులేని కృషి,
    యుద్ధములేని పరాక్రమోద్ధృతుల్,
చపలము లేని వృత్తి సహ
    జమ్ములు రాయలసీమ వారికిన్ ॥ ౨

పగఁబట్టిరా, యెంత బలవంతు తలనైనఁ
    ద్రుంచుదాఁకఁ గరాసి దించలేరు,
ప్రియమందిరా, బికారిగఁ ద్రిమ్మరిలువానిఁ
    బైకి నచ్చెడు దాఁక వదలలేరు,

వాదించిరా, యల్ల వాసవ గురునైన
'దాసోహ' మనుదాఁక దలఁగలేరు,
ఒసఁగిరా, యర్థి జనోత్కరమ్ముల కోర్కె-
లుడుపుదాఁక గరమ్ము ముడువలేరు,
మెచ్చిరా, కవి విద్వత్సముచ్చయముల
తనివి తీర్చెడు దాఁక బొమ్మనఁగలేరు,
అవని రాయలసీమ మానవులసాటి
వారు, ముమ్మాటికిని లేరు, లేరు, లేరు॥ ౭

ఎన్ని శివస్థలాలున్న 'దక్షిణకాశి'
యన, 'దక్షవాటి' యే యగునుగాదె,
ఎన్ని ముక్తిదపురా లెసఁగిన 'నవిముక్త'
మన, 'వారణాసి' యే యగునుగాదె,
ఎన్ని దేవాలయా లిరవారిన 'సురాల'
యు మన, నామేరువె యగునుగాదె,
ఎన్ని రత్నపుగను లెనసిన 'రత్నాక
రా'ఖ్య సంద్రమునకె యగునుగాదె,
యట్లె 'కటకంబు' మొదలు 'కన్యాకుమారి'
దనుక రాయలె పాలించినను 'ననంత
పురము,' 'కర్నూలు,' 'కడప,' 'చిత్తూరి,' 'బళారి,'
చేరిన స్థలమ్మె 'రాయలసీమ'—యనఁగ॥ ౮

చెవులపోఁతున కేని( జేవఁ గల్గించుటఁ
    గని, హరిహరుఁ డెన్ను కొనిన-చోటు,
రాచపాడిని గూర్చి రాగ్గాడఁ జర్చించు
    నని బుక్కరాయలు వినిన తావు,
పలుకళాగోష్ఠుల్ భువన విజయాస్థానిఁ
    కృష్ణ భూవరుఁ డొనర్చిన స్థలమ్ము,
మగఁటిమిఁ విమతుల మడియించి, రామరా
    యనిసేన లుసురు లిచ్చిన పొలమ్ము
ఆ విరూపాక్ష దేవు విహారభూమి
'రాజధానిగ రాయలరాజ్యమునకుఁ
దనరుఁ గా' కని శంఖ సంస్థాపనంబుఁ,
దాన సలిపె విద్యారణ్య సామి విభుఁడు ॥ ౫

అదియ 'విద్యానగర'మన నాంధ్రరాష్ట్ర
రాజధానిగ, మూఁడు తరాలవఱకు
వెలిఁగి, తెలుఁగు జనాల దుర్విధివశాన
శిథిలమై, చూపఱకు నేఁడు చింతఁగూర్చు॥ ౬

—(ఆంధ్రవాణి)

# హితబోధ

నన్నెయు వాసియుం గలుగు
    వారల, రాయలసీమవారిఁ దూ
ర్పన్నలు దోఁచివారలని
    యాత్మఁ దలంపరు, చూతురెంతయుఁ
జిన్నతనంపుఁ జూపుల, ని
    సీ! మఱి వారలు దెల్గుతల్లియ
భ్యున్నతికై శ్రమంపడరొ ?
    పోలరొ తమ్ముఁ స్వభావసంపదన్ ॥ ౧

ఆంధ్ర విశ్వకళాలయమున కుపాధ్యక్షు
    వరుఁడు రాయలసీమవాసి గాఁడె?,
రష్యాకుఁ బ్రతినిధి ప్రవణాతం గన్నధూ
    ర్వహుఁడు రాయలసీమవాసి గాఁడె ?,
చెన్న రాజ్య ప్రభుత్వోన్నతసభ కధి
    పతియు రాయలసీమవాసి గాఁడె ?,
రాష్ట్ర విద్యాధికారపదంబు నూను ధీ
    భాసి రాయలసీమవాసి గాఁడె ?,
ముఖ్య సచివులు పానుగల్ బొల్లినులును
వరుస రాయలసీమలోవారు గారె ?,
న్యాయపతులైన సోమయ నాగపూఁడి
భవుఁడు రాయలసీమలోవారుగారె ?॥ ౨

ఏమిటం దక్కువైతిమి మేము మీకు ?
సవతితల్లి ప్రియానఁ గాంచంగ మమ్ముఁ
గాననే కద యుజవల బానిసలుగ
నున్న వారము మనమెల్ల నన్నలార ! ॥ 3

నాఁడు 'శ్రీబాగుప్యాక్టు' కన్గంటఁ జూపి,
యింతలోఁ గికురింతు రిదేమిటయ్య ?
కానిచో, దాని యూసె యింతేని నెత్త
రేమి ? సోదరులార! మీరిపుడు చెపుడి ! ॥ ౪

గేలి గొందురు 'తిరుపతి' క్షేత్ర మనిన,
నవ్వ మూలందు రా 'యనంతపుర'-మనినఁ,
వెనుకఁబడె నటంద్రు 'కర్నూలిఁ' బేరుకొనినఁ
దగదె సీమను నేయూహ్ప్రధానపురిగ ॥ ౫

'బందరు' కెదలోన 'ప్లాను' గల్పించియే
మదరాసు విడుఁడన్న మాన్యుఁడొకఁడు,
'విజయవాడ' దె యింక విజయమంచని, దాని
సమ్మతించిన బుద్ధిశాలి యొకఁడు,
'వైజాగు' దే యెల్లభంగుల 'ఛాన్స'ని,
తలఁచి యూఁకొన్న యుక్తులుఁడొకఁడు
'ఏలూరిఁ' దప్పింప నెవరి తరంబని
భావించి సరియన్న ప్రాజ్ఞుఁడొకఁడు,

'చేనిలోఁ బ్రత్తి యాచేనిలోనె యుండ
నీకు మూరెఁడు, బారెఁడు నా'' కటన్న
సామెతగ, మది రాయలసీమ మాట
మఱచి, సరకారు సోదరుల్ మలఁగఁదగునె ?

సర్కారు ప్రజలకు సకలసౌకర్యాలు
    సీమవాసులకెల్ల జెముడుపాలు,
సర్కారు కవులకు షష్టిపూర్తులకోట్లు
    సీమకవులకు మోఁచేతిపోట్లు,
సర్కారు నాయక సమితి కెదుర్కోళ్లు,
    సీమనాయకులకుఁ జింతపేళ్ళు,
సర్కారు నిధులకుఁ జందాలు వేవేలు,
    సీమలో నిధులకుఁ జెనఁటిరాలు,
ఏమి ప్రియ ?—మేమియనురాగ ?—మేమిమనసు ?
ఏమి సత్కృప రాయలసీమమీఁదఁ ?
దూరుపుం దీరపుం దెల్గువారి కౌర !
మోసపోరింక రాయల పుడమి వారు॥ ౭

మీ సౌకర్యము కోసమే యనుచు న
    మ్మించక వినిర్మించి నా
రాసక్తిం, 'బెజవాడ' లో సకల వి
    ద్యావాస మానాఁడు;—మా

గాసల్ జాడఁగ, వేగఁ జేర్చితిరి మీ
రద్దాని ‘వాల్టేరు ?’ కి
మోసంబొక్కటి చాలదా ? యకట ! నో
మోటంబు మీకున్నదా? ॥ ౮

‘క్యాపిట’ లో, ‘హైకోర్టు’
యేపాటో మాకుఁజూపి యిప్పటి, కాప్పై
ఘూపము వేయఁగఁ జూచెద
రే?, పొసఁగదు, పొసఁగదయ్యా! యిఁక నెన్నఁటికిఁ గా
అక్షయదీక్ష, రాష్ట్రమున
కై, మనమెల్లరుఁ గూడి నిల్వ, ఫా
లాక్షునకైన నడ్డుపడ
నౌనె? తలంపుఁడు; పక్షపాతపుఁ
వీక్షణము ల్విడుండు; మము
వేఱుగ నెంచకుఁడయ్య ! సోదరుల్
ప్రక్షమబుద్ధిఁ గష్ట సుఖ
పాళిని బాల్గొనువార మెప్పుడున్ ॥ ౧౦

—(భారతజ్యోతి : 24–5–1950)

# శ్రమజీవి

జాతీయ చేతనా - శా సౌధమునకు నీ
నీతియే సోపాన మన్నా!
ఈ తీరు నెంచరీ - రాతి గుండెలదొరల్
పోతరించిన వారలన్నా! ॥జాతీయ॥ ౧

రేయుం బవళ్ళు నీ-కాయ కష్టమ్ముచే
వేయూళ్లు గడియింతు రన్నా!
నీ ఛాయ వొలిపింతు రన్నా! ॥జా॥ ౨

మండు టెండలకు, చలిపుండు గాలికి, వానకి
ఎండి వరుగై పోతివన్నా!
కండలన్ని హరించెనన్నా! ॥జా॥ ౩

కనికార మేలేని ధనదాసులను గొల్చి
మనఁ జూచు టతి కష్టమన్నా!
ఘన మదాంధులు వారలన్నా! ॥జా॥ ౪

బొట్టలకు పండించి, పెట్టెలన్నించి, నీ
పొట్ట కీయఁగ నేడ్తు రన్నా!
వెట్టి చాకిరి కీడ్తురన్నా! ॥జా॥ ౫

గలగలా ప్రోఁగు రూకలలోన నీగోడు
తలఁచి, యాలించలేరన్నా!
తొలఁగింపఁగాఁ బూనరన్నా! ॥జా॥ ౬

బంగారు తళ్కుపోఁతలం గన్నుఁగప్పి, నీ
సంగతింత గ్రహింపరన్నా!
కంగారు పోఁగొట్ట రన్నా! ॥జా॥ ౭

మదమెక్కు దొరల సంపదఁ జూచి, బానిస
బ్రదుకు కిచ్చగింతువో యన్నా!॥
హృదయమున్నదె వారికన్నా! ॥జా॥ ౮

మది మాత్రమే గుడి – యొడయఁడే వేల్పు, నీ
పసుపాటులే పూజలన్నా!
యిసుము లాతఁడు వాపఁడన్నా! ॥జా॥ ౯

నిత్య తృప్తి వహింతు సత్యమ్ముఁ దప్ప, నీ
సత్యాహితం బేమిటన్నా!
గత్యంతరమె లేదటన్నా! ॥జా॥ ౧౦

ఱేఁడైనఁ జేసాఁచి, వేఁడు నీ బిచ్చమ్మె
పాడు గర్వమదేల రన్నా!
మేడ్పైఁ బరుగు లేలన్నా! ॥జా॥ ౧౧

పదవుల స్నిదయఁ గుదురు కొన్నయ్యాలే
మొదవింతు రెగ్గు నీకన్నా!
అది వల్దనఁగ నెవ్వరన్నా! ॥జా॥ ౧౨

'ఏకాం స్తేను'ల పైని నూరేఁగువారు, ని
న్నేరీతిఁ గనుఁగొందు రన్నా!
చేరి, నీవెతఁ దీర్తు రన్నా! ॥జా॥ ౧౩

లోక మాఁకటను జీకాకు నొందఁగ, దానిఁ
బోకార్చు వాఁడ వీవన్నా!
ఆ కృతజ్ఞత దోఁప దన్నా! ॥జా॥ ౧౪

కల్లకౌఁడులులేక తెల్లనన్నియుఁ బాలు
నల్లనివి నీరందువన్నా!
కల్లరులు నినుఁ బోలరన్నా! ॥జా॥ ౧౫

నీ నాగలియె సాటిలేని యీవుల మ్రాను
దీనత్వ మెడఁబాపు నన్నా!
ప్రాణ భిక్షము వెట్టునన్నా ॥జా॥ ౧౬

మడిగట్టు గద్దె, వెంబడినెడ్లు బంట్లు, నీ
గుడిసెయే నగరు సుమ్మన్నా!
పడఁతియే నీరాణి రన్నా ॥జా॥ ౧౭

వేవెలుఁగు రేవెల్గు నీవున్న గుడిసెలోఁ
ఆవాస మొనరింతురన్నా!
సావాసమా వార? లన్నా! ॥జా॥ ౧౮

తెలజొన్న యన్నమ్ము పులగూర పామ్మి, తే
న్నులు సూచు నీపెండ్లమన్నా!
ఇలు తొందరగఁ జేరుమన్నా! ॥జా॥ ౧౯

తలలోని నాలుకై మెలఁగు నీప్రియురాలి
పలికించి, మురిపింపుమన్నా!
వెలలేని దాప్రేమ మన్నా! ॥జా॥ ౨౦

నల్లగాజులు, పుస్తె, నల్లపూసలత్రాఁడు
ఇల్లాలి కుల్లాసమన్నా!
కొల్లలౌ భూషణములన్నా! ॥జా॥ ౨౧

పెంకుమూఁకుట మెక్కి, చింకిచాపఁ బరుండు
బింక మేమిటి చెప్పుమన్నా!
కంకాళమైతి, వోయన్నా! ॥జా॥ ౨౨

ముఱికి తడి పొత్తిళ్ళ చిఱునవ్వు నగు పాప
తెఱఁ గరసి యుప్పొంగుదన్నా!
మఱచిపోవుదు కష్టమన్నా! ॥జా॥ ౨౩

—(ఆంధ్రవాణి : 21—4—1950)

———

# ఏమండీ ?

జైలు కెడితే జన్మవాసన చచ్చిపోయిందా ?
ఖాది గడితే లోని విషమూ కాలిపోయిందా ?
తెల్లటోపీ పెడితె మొదటీ క్రుళ్ళుపోయిందా ?
        జాతి తండ్రి ప్రతిష్ఠ చెడిపి
        నీతి నీమాల్ గంగ గలిపి
        రోత పనులూ చేతు రేమండీ ? ౧

జైలుకెళ్ళి వచ్చినందుకు మంత్రిపోవాలా ?
లాఠిదెబ్బలు తిన్నదానికి మడులు మాన్యాలా ?
కాంగ్రెసంటే లైసెన్సులూ, సరకు పర్మిట్లా ?
        సొంత లాభము చూచుకుంటూ
        చెంత బీదలగోడు వింటూ
        చింతయైనా పొందరేమండీ ? ౨

'ఊటి'కెళ్ళే తెల్లవాళ్ళను ఓగుచేశాము
పన్నులడిగే పరులపాలన పడఁగఁ దిట్టాము
కాంగ్రెసన్నల కొట్టినారని కడిగిపోశాము
        ఎండదెబ్బకు కొండకెళ్ళి
        దండి ఖర్చులుచేసి, మళ్ళీ
        'తెండి పన్నూ' లందు రేమండీ ? 3

శాంతి సౌఖ్యాల్లేక గ్రామ జనులు తూలారు,
కాఁడి మేఁడులు లేక రైతులు పనులు వీడారు,
కూడు గుడ్డల కర్వుచే, ప్రజ కుప్పగూలారు,
ఉన్నవారిన చూచి యేతే
అన్నలారా! కడుపుకాంత్ర
సన్నగాంధ్రను మఱతు రేమండీ!! ౮

—(ఆంధ్రవాణి : 16—6—1950)

# దొరతనమా?

మలమల మాఁడే – వలవల యేడ్చే
సిలుగుల లోకం – తిలకించని యిది
        దొరతనమా? మఱి నెఱతనమా? ౧

కూటికి లేని–పాటక జనాల
కోటి మాటల – బూటక మాడే
        దొరతనమా? యిది నెఱతనమా? ౨

'ఆఁకలి మంటకు – లోకం పోతే
మాకేం? పదవులు–రాక మానే'నను
        దొరతనమా? యిది నెఱతనమా? ౩

'చస్తే మిగిలిన – అస్థి పంజరాల్
మస్తుగ ఎరువుల కిస్తా' మను – ఇది
        దొరతనమా? మఱి నెఱతనమా? ౪

నైతుల నోళ్ళు – మూఁతలు మూసే
సాఁతనీతుల – కోఁతలు కోసే
        దొరతనమా? యిది నెఱతనమా? ౫

నల్ల బజార్ల – పిల్ల బొజ్జలను
మెల్లగ నిమిరే – చల్లని యూహల
        దొరతనమా? యిది నెఱతనమా? ౬

ఈఁగలమోఁతలు – ఇంట్లో చూస్తే
స్వాగత పత్రాల్ సభలో పొందే
దొరతనమా? యిది నౌజతనమా? ౭

'టీపార్టీ'లను మెప్పులు మరగిన
సామ్రాట్రాముల 'గ్రూపు'ల గూడే
దొరతనమా? యిది నౌజతనమా? ౮

గుడిసెకు వాసం – నడుముకు వస్త్రం
కడుపుకు గ్రాసం – గడపక పోతే
దొరతనమా? – యిది నౌజతనమా? ౯

'గాంధీ' నామము – 'ఖరాబు' చేసే
సంధి ప్రలాపాల్ సాగించే – మన
దొరతనమా? – ఇది నౌజతనమా? ౧౦

—(ఆంధ్రవాణి)

---

# ఆంధ్రరాష్ట్రము

ఆంధ్రరాష్ట్రము మఱచిపోవన్నా!
ఆశపెట్టుక చావవలదన్నా! ॥ఆం॥ ౧

స్వార్థపరులై పదవులకు మన
వారు తల్లిని విడిచిరన్నా! ॥ఆం॥ ౨

తెలుగుసందనమే చచ్చిపదవులఁ
గులికెదరు మనవారలన్నా! ॥ఆం॥ ౩

తెల్లవారికి జీహుకుములే
యెల్లపుడు మనవారలన్నా! ॥ఆం॥ ౪

రాష్ట్రపతులును రాష్ట్రహితులును
రాష్ట్రమునకు విరోధులాయన్నా ॥ఆం॥ ౫

పరులకంటెను హెచ్చు మనవా
రొరఁగఁ బెట్టిన దేమిటన్నా! ॥ఆం॥ ౬

చచ్చు తెలుఁగులు పిచ్చివారని
చిచ్చికొట్టెద రందఱోయన్నా! ॥ఆం॥ ౭

మెత్తఁగా మనమున్నవారని
మొత్తసాగిరి యెల్లవారన్నా! ॥ఆం॥ ౮

పరులపంచలఁ జేయిసాచెడు
తిరిపెగాండ్రయి రాంధ్రులన్నా! ॥ఆం॥ ౯

అడ్డమైన పరాయి వాండ్రకు
అడుగు లొత్తుట లేలరన్నా! ||ఆం|| ౧౦

గూండ కట్టాల తోడి అఱవల
పీడ నీకును వదలదన్నా! ||ఆం|| ౧౧

ద్రావిడులకే బానిసత్వము
తప్పదెప్పుడు మనకు నోయన్నా! ||ఆం|| ౧౨

చెన్నపురి తమ తాత సొమ్మంట!
నిన్ను పొమ్మనుచున్న వారన్నా! ||ఆం|| ౧౩

చెన్నపట్నమె కాదుగా, నీ
వున్న సీమయె సున్న నీకన్నా! ||ఆం|| ౧౪

అసలు రాష్ట్రమె లేకపోయె, వి
శాల పాంధ్రం బేమిటన్నా! ||ఆం|| ౧౫

తెలుఁగునెత్తురు తెలుఁగు తేజము
నిలుపు నాయకు లేగిరన్నా! ||ఆం|| ౧౬

—(ఆంధ్రవాణి)

# ప్రబోధము

దీక్షా కంకణముం ధరింపు, మిదె, సా
ధింపన్ స్వాతంత్ర్యాత్మ నం
దక్షా దక్షమతిం, దెలుంగు ధరణిం
బ్రార్థింప కన్యాళి, నీ
రక్షుం గల్గు జనంబె గెల్చునని, ఢం
కా గొట్టి, లోకుల్ మహో
త్సేకు, న్నిన్ బురికొల్పుచుం గనెద, నో
వీరుండ! లే లెమ్మిఁకన్ ॥

దానధారల 'విశ్వదాత' విజ్ఞతఁ దెల్గు
నేలఁ బైరిడుట గణింపలేవె?,
ప్రాణకర్పూర నీరాజన 'మాంధ్రర
త్నము దల్లి కొసఁగుటఁ దలఁపలేవె?,
సర్వస్వమును సుమాంజలిగాఁగ 'నాంధ్రకే
సరి' మాత కర్పించుటరయలేవె?,
ప్రత్యేకరాష్ట్ర జపంబుతో 'దేశభ
క్తుఁడు' పండిరాలు టూఁకొసఁగలేవె?,
ఏల యీలీల బేలవై, ప్రాలుమాలి
దిక్కుదోఁపక యూరక దిగులువడెదు?
భావి భారత భాగ్యమ్ము త్వత్కరముల
యందె కలదయ్య! లెమ్మ, లెమ్మాంధ్రవీర!॥

నాఁటి యాంధ్రోద్యమ నాయకులే నేఁడు
పప్పులో నడుగు దార్వైచిరనుచు,
నాఁటి రాష్ట్రాశయాన్వహ చింతనులె నేఁడు
శిల్లి జోహుకుము పాటించిరనుచు,
నాఁటి తెల్గుల చెన్నసగరవాదులె నేఁడు
అఱవల శౌనిస లయిరటంచు,
నాఁటి స్వజాత్యవన ప్రవీణులె నేఁడు
గ్రుక్కుమిక్కనకయ నక్కిరనుచుఁ
జింతిలకు, చీదరింపకు, సిగ్గుపడకు
సహజమే మనవారి కాజబ్బులెల్లఁ
గాన రాష్ట్రార్జనకు నీవ పూనవలయు
లెమ్ము, లెమ్మాంధ్ర వీరుఁడ! ఆోమ్మునఱచి॥
ాజన సూపఁగ లేని సూరి వర్యుల ధర్మ
పన్నములకు నిఁక స్వస్తి యనుము,
గుండెధైర్యము లేని గురువుల శాంత్యుప
న్యాస ధోరణికి జోహారులనుము,
ముందంజ లేని ప్రబుద్ధుల సమరస
ప్రవచనమ్ములఁ ద్రోసిరాజులనుము,
సిండశక్తియె లేని పెద్దల యుపదేశ
సారము లేక బలాదూరులనుము,
ఆత్మబలమున విశ్వాస మంది కొనుము,
కనుము నీ భావి షౌర సద్గౌరవమ్ము,
రాష్ట్ర నిర్మాణ కార్యసూత్రమ్ముఁ గొనుము,
ఆంధ్ర వీరుఁడ! లెమ్ము, జయమ్ముఁ గనుము॥

తెలుఁగు సీమ దినంబు దేశానఁ జాటించి
పూర్తిగా హర్తాళముల నొనర్చ,
జనవాక్యమే ప్రజాస్వామికమున ముఖ్య
మనుట నాయకు లెంచునటు లొనర్చఁ,
ప్రత్యేక రాష్ట్రమేర్పడు దాఁక నిడుముల
కగ్గమై సత్యాగ్రహము నొనర్చ,
'నెల్ల రేకోన్ముఖు లీపూని—' నని యూర
నూరఁ దీర్మానము లూఁగి నొనర్చ,
నాంధ్రులను బ్రోత్సహించి యత్యంత నియతిఁ
దెలుఁగు రాజ్యము వేగ సాధింప, లెమ్మ!
నడుము గట్టుము! ముందడుగిడుము! పరుల
నాశ్రయింపకు మిందుల కాంధ్రవీర!॥

అటు 'గంజా'—మిటు 'చెన్నపట్టణము' ప
ర్యంతంబు మాదంచుఁ, జా
టుటకుం బోలెదు 'దాఖలాల్'గలవు, చూ
డుం డక్క—జే యున్న, మీ
రెటులుఁ మద్రపురంబు వీడవలె మా
కే, తప్పదో ద్రావిడుల్
కుటిలో పాయము లింకఁ జాలునని వా
కొమ్మాంధ్ర వీరాగ్రణీ!॥

# రామరాజ్యము

కులము తత్త్వము కూలద్రోసీ
మతము మదమును మంటవేసీ
మెచ్చు త్యాగుల మచ్చరోసీ — ఖ్యాతిఁగాంచండోయ్ ॥ ౧

ధనికవాదము నెగురగొట్టీ
దాస్య బుద్ధిని తగులబెట్టీ
పేదరికమును వెన్నుదట్టీ — పేరుఁగాంచండోయ్ ॥ ౨

ప్రజల నౌకరతనమని తలంచీ
ప్రభుత గల బాగోగులెంచీ
పాలకుల స్వార్థమ్ము ద్రుంచీ — మేలుగాంచండోయ్ ॥ ౩

బూటకపు నాయకుల ద్రోలీ
పాటకపు జనములను నేలీ
కూటిపేదల శ్రమకు చాలీ — కీర్తిఁ గాంచండోయ్ ॥ ౪

నిక్కుబుజ్జల తిక్కబాపీ
దిక్కుమాలినవారి లేపీ
బక్కగుండెల యుక్కు రేపీ — ప్రతిభఁగాంచండోయ్ ॥ ౫

ఆముగల యధికార్ల దించీ
ప్రేమ, దేశము మేల్గణించీ
రామరాజ్యంబన జరించీ — యశముఁగాంచండోయ్ ॥ ౬

—(ఆంధ్రవాణి).

# వోట్ల బాజాలు

వోటివ్వండోయ్ – సోదరులారా!
వోటివ్వండీ – ప్రజాపార్టీకే॥
పరమాణుని పట్టీ – ఖైదుచేస్తాం,
వర్షాల్ మస్తుగ – కురిపించేస్తాం,
ఆహారాల్లో – ముంచెత్తేస్తాం,
మిల్లుబట్టలకా – దానాల్ చేస్తాం ॥వో॥

. . . . . . . . . . . . . . . . . . . . . . . .

వోటివ్వండోయ్ – సోదరులారా!
వోట్లు వోట్లు కమ్యూనిస్టులకే॥
కుబేర్ల మీద – గుండ్లు విడుస్తాం,
బీదలయింట్లు – బంగరు చేస్తాం,
పితృలోకాల్ ప్రత్యక్షం చేస్తాం,
క్రెమ్లిన్ రాజ్యం నిలబెట్టేస్తాం ॥వో॥

. . . . . . . . . . . . . . . . . . . . . . . .

వోటివ్వండోయ్ – సోదరులారా!
వోటివ్వండీ – సోషియలిస్టుకే॥
ఉండేవాళ్లకు వూడబెరుకుతాం,
యెండేవాళ్ళకు పొలాల నిస్తాం
చాలకపోతే భూములు తెస్తాం
అందరి కధికారా లర్పిస్తాం ॥వో॥

. . . . . . . . . . . . . . . . . . . . . . . . .
వోటివ్వండోయ్ – సోదరులారా!
వోటివ్వండీ హిందూసభకే! ॥
పాకీస్తానూ పడగొట్టేస్తాం
అఖండభారతం అందిచ్చేస్తాం
హిందూరాజ్యమె వెలిగించేస్తాం
అఖండస్వర్గమె అందరు పోదాం ॥వో॥

. . . . . . . . . . . . . . . . . . . . . . . . .
వోటివ్వండోయ్ – సోదరులారా!
వోటివ్వండి కృషికార్మికులకె॥
రైతులయిండ్ల ధనం పండిస్తాం.
రైతుల మేడల కెక్కించేస్తాం.
రైతులరాజ్యం స్థాపించేస్తాం,
రైతుల దేవతలను చేసేస్తాం ॥వో॥

. . . . . . . . . . . . . . . . . . . . . . . . .
వోటివ్వండోయ్ – సోదరులారా!
వోటివ్వండీ – స్వతంత్రపార్టీకె ॥వో॥
స్వతంత్ర మంత్రులమై కూర్చుంటాం,
స్వతంత్రముగ మిము పరిపాలిస్తాం,
స్వతంత్రముగనే చంపించేస్తాం,
కూడుగుడ్డ లేకుండా కాస్తాం ॥వో॥

..............................
వోటివ్వండోయ్ — సోదరులారా!
వోటివ్వండీ — కాంగ్రెసువారికే॥
జరిగినదానికి — మనమేం చేస్తాం,
జరిగిపోయినదాని మరుస్తాం,
బ్లాక్ మార్కెట్లను బంధించేస్తాం,
లంచగొండ్లను తొలగించేస్తాం వో॥

పంచవర్ష ప్రణాళిక చేస్తాం,
భరతభూమిని బంగరుచేస్తాం,
దేశన్నింకా యెక్కువ చేస్తాం,
మామాట వినేట్టుగ చేస్తాం ॥వో॥

కడుపుకు దండిగ మీకిప్పిస్తాం,
చిలగడదుంపను సప్లైచేస్తాం,
గానుగపిండీ దండిగ యిస్తాం,
వేరుసెనగలూ — దిగుమతి చేస్తాం ॥వో॥

ఖిండికి వనోత్సవాల్ జరిపిస్తాం,
మూడోతరాన—వర్షాలిస్తాం,
అందుకిప్పుడు — మనమే చస్తాం,
ముందువారికీ — సుఖాల నిస్తాం ॥వో॥

పన్ను లెక్కువని — యేడవకండి,
పన్నులతోనే — పనులవునండి,
అన్నిలాభములు — మీకేనండి
పన్నులు వచ్చిన — వదలదుసుండీ ॥వో॥

జీతాల్ బత్యాల్ - కావలెనండీ,
ఏరోప్లేనులు యెగరాల్నండీ,
దేశాన్నంతా తిరగాల్నండీ,
టీపార్టీలు జరగాల్నండి ||నా||

పన్నులు వేయని పార్టీ యేది ?
నష్టాన్నిచ్చే పార్టీ యేది ?
మీసుఖమెంచే పార్టీ యేది ?
గాలిమేడలకు నిలకడ యేది? ||నా||

—(మాతృసేవ : 8—12—1951).

—— —— ——

# తెలుఁగూ భాయ్

ఎవరికి వచ్చిన స్వతంత్రమోయ్ ?
ఎగిరెగిరిపడే తెలుఁగూభాయ్ ! ॥

ఆఁకలికేడ్చే అతిదీనులకా ?
చీఁకిన మేనుల శ్రమజీవులకా ?
వాకొనలేని బడుగుమూఁకకా ?
నీకా ? నాకా ? ఆంధ్రజాతికా ? ॥ఎవరికి॥ ౧

తెల్లవారికా ? ఢిల్లివారికా ?
కొల్లలుగొట్టే సావుకార్లకా ?
అల్లరిచేసే అరవన్నలకా ?
నల్లపట్టుల గుల్లకాండ్రకా ? ॥ఎవరికి॥ ౨

లంచాల్లాగే అధికారులకా ?
సంచులునింపే ధనవంతులకా ?
వంచించే పర వణిగ్వరులకా ? ॥ఎవరికి॥ ౩

ఉండే బొజ్జకు స్వాతంత్రం,
మండే పొట్టకు పరతంత్రం,
నిండినవారికి స్వాతంత్ర్యం,
ఎండేవారికి పరతంత్రం ॥ఎవరికి॥ ౪

తెలుఁగుల కుళ్ళులు విచ్చిందా ?
తెలుఁగుల తెలివి హెచ్చిందా ?
తెలుఁగుల కక్షలు చచ్చిందా ?
తెలుఁగులరాష్ట్రం వచ్చిందా ? ॥ఎవరికి॥ ౫

నక్క మొగాలకు స్వాతంత్ర్యం,
ఒక్క వాళ్ళకూ పరతంత్రం,
ముక్కె దొరలకు మంత్రిత్వం,
చిక్కినబంట్లకు దాసత్వం ॥ఎవరికి॥ ౬

వన్నెయు వాసియు గనలేవే,
మిన్నగ అరవల పోగిచేవే,
చెన్నపురం మన దనలేవే,
తిన్నగ తెలుఁగే మరిచావే ॥ఎవరికి॥ ౭

గెలవని పెద్దలదే రాజ్యం,
గెలిచిన యువకులకే పూజ్యం,
తెలివి తేటలు సంత్యాజ్యం,
తెలుఁగులకిక దైన్యమె భోజ్యం ॥ఎవరికి॥ ౮

నోరుంటేనే అధికారం,
పౌరుషమొకటే వడసారం,
కోరి వేడితే తీరదు బేరం,
నీరాష్ట్రం, కొనకుంటే, నేరం ॥ఎవరికి॥ ౯

సత్తాత్రాణ పూనిక విడకుండా,
చిత్తయిపోయిన, చేడ్పడకుండా,
సుత్తిలు నైరులమెడ గుదిబండా,
ఎత్తిత్తి, దింపకుమూ, మనజండా! ॥ఎవరికి॥ ౧౦

(మాతృసేవ : 10—౯—1952)

# జయరాజారాం

రాష్ట్రగవర్నర్ పట్టావస్తే,
చచ్చృధ్యక్షత సంజీవిస్తే,
చప్పిడిపల్కులు ప్రకాశమిస్తే,
ఆంధ్రరాష్ట్రమే–సీతారాం ।
రామరామ జయ రాజారాం ॥ ౧

ఢిల్లి 'హుకుం'కు జోహార్లంటే
ప్రధానులాజ్ఞకు 'సరిసరి'—అంటే
మంత్రిత్వాలకు గిరికీ లొక్కడితే
ఆంధ్రరాష్ట్రమే—సీతారాం ।
రామరామ జయ రాజారాం॥ ౨

కృష్ణా పెన్నార్ అరవలద్దైతే,
పుల్చింతలకూ పూజ్యం పెడితే,
రాంపదసాగర్ రంధి వదిల్తే,
ఆంధ్రరాష్ట్రమే సీతారాం ।
రామరామ జయ రాజారాం॥ ౩

మద్రాస్ ధారాదత్తం చేస్తే,
కోరాపుట్టి కొట్టుకపోతే
బళ్లారిజిల్లా కన్నడచేస్తే
ఆంధ్రరాష్ట్రమే సీతారాం ।
రామరామ జయ రాజారాం॥ ౪

తెలంగాణను చీల్చకపోతే,
కృష్ణను భద్రను కలపకపోతే,
తెలుగే యెప్పుడు వాడకపోతే,
ఆంధ్రరాష్ట్రమే సీతారాం।
రామరామ జయ రాజారాం॥ ౫

రాయలసీమ రగులుకుచస్తే,
మనగనులన్నీ మట్టిగలిస్తే
పరభిక్షానికి చేతులు చాస్తే
ఆంధ్రరాష్ట్రమే సీతారాం।
రామరామ జయ రాజారాం॥ ౬

—(మాతృసేవ: 20—9—'52)

# ప్రళయ ఘోష

ప్రళయ తాండవరుద్ర ఫాలానలాభీల
పటపటార్భటి దూలి—
భస్మసాత్కృతిఁ బొందునా ?—లోకమ్ము
భ్రష్టమే యైపోవునా ? ॥ ౧

ఝుంఝూ సముద్ధూత సంక్షుబ్ధ వారాశి
వీచి జిహ్వాగ్రాల—
నాకృష్టమై పోవునా ?—భువనమ్ము
నాశమే యైపోవునా ? ॥ ౨

భీకర క్షామక్షుధాసీ విషోద్వేల
గరళ సంఛన్నమై—
యాకారమే మాఱునా ?—విశ్వమ్ము
అణగాఱియే పోవునా ? ॥ ౩

విస్ఫార విస్ఫులింగ క్రోధతామ్రాక్షు
మృత్యుదంష్ట్రాగ్రకోటి—
నుద్భిన్నమై కూలునా ?—యిజ్జగతి
యుద్భ్రాంతమై పోవునా ? ॥ ౪

క్రూరరక్షోగణోత్క్షిప్త రూక్షాణ్వస్త్ర
ధూమావృతాంధమై—
నిర్వీర్యమయి పోవునా ?—భువియెల్ల
నిర్మూలమై పోవునా ? ॥ ౫

—(మాతృసేవ)

# ఆస్థానకవి

తెలుఁగు పలుకుల వెలఁది వెలుఁగు
కలికి కయితకు కంటి తళుకు
పలుకళల కలకండ పలుకు॥
—పోయెరా—మనజాతిరత్నం పోయెరా॥ ౧

బిరుసు దొరలకు ప్రక్కశూలం
దురుసు కవులకు గుండెగాలం
పరమ శిష్యుల కల్పసాలం॥
—పోయెరా—మనజాతిరత్నం పోయెరా॥ ౨

చెఱకు నుడువుల పూలచెండు
తొఱకు రసముల కైతనిండు
ఎనుబదేడుల తెలుఁగుపండు॥
—పోయెరా—మనజాతిరత్నం పోయెరా॥ ౩

గళము కదలుప ఘంటరవము
పలుకు పలుక రసానుభవము
కలను మనచెల్పిళ్లమణువము॥
—పోయెరా—మనజాతిరత్నం పోయెరా॥ ౪

ఇల స్వధర్మము తీర్చి చివికి
బలరిపుఁడు పిలుపంప కవికి
అల సుధర్మను వెలయు, దివికి॥
—పోయెరా—మనజాతిరత్నం పోయెరా ౫

—(ఆంధ్రవాణి)

# కవిసార్వభౌముఁడు

అకట! తలకొట్లమారి బ్రహ్మకు, నిదేమి
చేటుకాలమొ? చెడుపనుల్ సేయుచుండు
సుకవులకు నాయు వెచ్చింపఁ జూడఁడెపుడు
తెలుఁగు-కవులెడ నతని కీ తెగులు తగునె? ॥ ౧

మొదటి యాస్థానకవి తెల్గు పుడమి వీడి,
యాఱునెల లాయెనో, లేదో, యంతలోనె
చనితె? రాయలసీమకు సత్కవికుల
సార్వభౌముఁడ వీవును సాధుచరిత! ॥ ౨

మొన్న 'మే' లోన నారు నాగన్నతోడ
కడప కరుదెంచి మంచముఁ గఱచికొన్న
సీ కృశించిన తనువుఁ గాంచితినో, లేదో,
దిటము దిగజాఱె నాగుండె లోఁటుకు మనియె॥ 3

ఎండ లడఁగిన మదరాసు కేఁగుదెంచి
యుండవలెనంటి, స్కాందాన నున్నమిగత
ఖండములు సేతునంటి వీ కర్మమేమి?
కన్ను మూసితి వింతలోఁ గవివరేణ్య! ॥ ౪

రామదాసు చరిత్రంబు వ్రాయుమంటి
వస్తు సామగ్రి యొసఁగి తోడ్పడుదునంటి
వందులకుఁ దల యూఁచితి, వకట! తుదకు
మాట దక్కించుకొనకయ దాఁటి నావె? ॥ ౫

నియత లలితార్చనమె నీదు నియమనిష్ఠ,
యనిశ మతిథి సపర్య నిత్యవ్రతంబు,
కావ్య నిర్మాణవృత్తి నిష్కామకర్మ
లెక్కయే యొజ్జనము, పనిలేని కొలువు॥ ౬

సత్య శౌచ దయాచార శమదమములు
గలవు రెంటనె :—ప్రాక్పుస్తకములయందు,
నీదు జీవితమం, దిది నిక్కువంబు
వెలయునే నినువంటి నిర్మల గుణుండు ?॥ ౭

నీవు భౌతికముగ మాకు లేవు, గాని
నీ మహిత కావ్యములె నవనిధులు మాకుఁ,
దసరి వేంకటకవితో సుధర్మయందు
నమర సుఖములు గనుమ, శేషాద్రి శర్మ !॥ ౮

—(ఆంధ్రవాణి).

---

# పుత్రా

ఫలముల బరువున వృక్షం
బిలకెట్టులు వంగు, నట్లె, యీ వెంతయు వి
ద్దెల నేర్చుకొ లేంది నడంకువ
వెలయంగం జరియింప యశము పెంపగుం బుత్రా॥ ౧

దడబుడలు సేయకు, వెలితి
కడవవలెన్, భంగపాటు గలుగును, దానన్,
గడు శాంతముతో నిండిన
కడనవలె న్మెలంగం గీర్తి గలుగును బుత్రా॥ ౨

మొఱిగెడు కుక్కలు దొంగలం
గాఱుకునె? తమ తోంక ముడిచి కొనుచుం బాఱున్
దఱచుగ మాటల నాడెడు
మొఱకులు కార్యము లొనర్పం బూనరు పుత్రా॥ 3

తనబాస, తనదు దేశం
బను నభిమానంబు మనసు నందుంచని యా
మనుజుండు బ్రదికిన పీనుంగు
కన, నత్యధముండు పశువుకంటెను బుత్రా॥ ౪

తలకుం జెప్పులు, గొనగో
రులకు న్మెచ్చులను గోరుం గ్రొత్తగ భాగ్యం
బులు వడసిన నీచుండు, దన
తొలుతటిస్థితి యెల్ల మఱపు దోంపంగం బుత్రా!॥ ౫

—(సెంటుపాల్సు హైస్కూలు మ్యాగజైను: మార్చి 1936)

# శౌర్యము

కుంజర మదంబు నడఁచు నంకుశ మదెంత ?
పర్వతంబులఁ బడఁగూల్చు వజ్రమెంత ?
చీఁకటిని బాపు దివ్వియ రేక యెంత ?
బలుపు బలమౌనె ? శౌర్యమే బలముగాని॥ ౧

భాను కిరణంబులఁ దపింపఁ బడినయట్టి
సూర్యకాంతోపలంబు తచ్ఛౌర్య గుణము
నోర్వకింతయుఁ దేజంబు నుమియుఁగాదె
సైఁచునే శూరుఁ డన్యుని శౌర్యగుణము ? ౨

శౌర్యవంతుఁ డొకానొక సమయమందుఁ
బేదవడియును శౌర్యమ్ము విడువఁ బోఁడు,
క్రింది ముఖమైన నేమి ? యగ్నికిఁ గలట్టి
మంట లెప్పుడు మీఁదికే మండుగాదె॥ ౩

—(సెంటుపాల్సు హైస్కూలు మ్యాగజైను: అక్టోబరు 1939)

---

# పక్షపాతి

ఒకనిని ప్రభునిగా నొకని సేవకునిఁగా
        నొనరించునట్టి నీ యొఱవఁదనము,
ఒకనిఁ బాలకునిగా నొకనిఁ బాలితునిఁగా
        సలిపెడు నట్టి నీ జాణతనము,
ఒకని ధనాఢ్యుఁగా నొకనిని బేదఁగాఁ
        జేసెడు నట్టి నీ చిలిపితనము,
ఒకనిని దాతఁగా నొకని యాచకునిఁగా
        గావించునట్టి నీకలితనమ్ము
మెచ్చఁగా వచ్చు, నయ్యారె! మేలుమేలు!
బళిబళీ! యింతగాఁ బక్షపాతి వైన
నీవ, జగములఁ బ్రోచెడు నేర్పరి వఁట
నవ్వరే విన్నవార లనాథనాథ!॥

—(ఆంధ్ర పత్రిక : ప్రభవ—మార్గశిరశుద్ధ౮)

# చక్కట్లు

## I. మూఢులు

నాయింతి నావశంవద
గా, యని మదినెంచు నెవఁడు, గడు మూఢుఁ డతఁ,
డే యతివ మగం డలరు
న్నా యెడ, నని యెంచు, నది, కనఁ జడమతియే॥ ౧

## 2. సంసర్గము

బలవంతుని సంసర్గము
వలన నె, యల్పుండుఁ గూడ వరమహితుఁడగుఁ,
ఇల నల్లుని వెంబడిఁ జను
చెలికానికి గౌరవంబు సేయుదురుగదా॥ ౨

అమలుండగు జనుఁడేఁ, రా
గము మున్నగు వాని సంగగతి, వికృతిఁ గనుఁ;
గమలాప్తాంశువులు, త్రికో
ణ మహితదర్పణము సొచ్చినం, జెడు సరణిఁ॥ 3

## 3. నైజగుణము

పచ్చకప్రపు రజమునఁ బాదు చేసి,
మృగమదము చందనము చేర్చి యెరువు వైచి,
యనుదినము, పుష్పసారసేచన మొనర్చి,
పెంచినను, నుల్లి, స్వగుణంబు విడువఁ గలదె?॥ ౪

## 4. యశము

హేమయుక్తిం జలికొండ, లాంఛనతఁ దా
రేశుండు, క్షారోదకా
క్రమణాప్తిం జలరాశి, సర్పవృతి శ్రీ
ఖండంబు, ముండ్లన్ సరో
జము, వార్ధక్యమునన్ సుమాంగి, పసుటన్
జంచత్కుచంబుల్, దరి
ద్రముచే విజ్ఞుఁ, డిటెల్ల బాధితు, లబా
ధం, బాయశం బొక్కఁడే॥ ౪

## 5. యోగ్యత

పెద్ద చదువులు సదివినఁ; బేర్మిఁ గనినఁ;
బైకి, యోగ్యతఁ గలవానివలె మెలఁగిన;
ఫలము గలదె?; మదిం గల పరధనాశ
పరసతీవాంఛ, నరునకుఁ దొరఁగదేని॥ ౫

## 6. వైపరీత్యము

కడిఁదిమాటలు గలవాని మనసు, మృదువు
మనసు పెనుబండ యగువాని మాట మధువు
కటువుగాఁ గూయు నెమ్మి మేల్. కనులకింపు,
పైకి నలుపైన కోయిలపాట సొంపు॥ ౬

## 7. సంస్కృతి

కామ్రజములు జీర్ణపర్ణముల్ జాఱవిడుచు,
నురగములు, ప్రాంతకుప్పసం బూడ్చివైచుఁ;
పక్షులును బాడుగృహములు విడిచిపెట్టుఁ;
ప్రజలు, మునుపటి పద్ధతుల్ వదలరకట! ॥ ౮

మను పరాశర ముఖ్యుల దినములందు
వెలయు మన సాంఘికాచారములనె, నేఁడుఁ
గూడఁ, బ్రజ యవలంబించఁ గోరు బుధులు,
కాల పరివర్తనము, నింత గాంచ రహహా! ॥ ౯

## 8. ధనము

'ధనధనధన' నినద, మచే
తనమగు దుందుభియె, సర్వదా, సల్పఁగఁ, జే
తనవంతు, జన, మానినదం
బానరించు, టదేమి లెక్క? ; యుర్వీస్థలిలోన్॥ ౧౦

తనరు నెవనికి, విపులవిత్తమ్ము, వాఁడు
బ్రహ్మహంతకుఁడే యైనఁ, బెఱియు ఘనత;
శశి సమూహముల వంశ సంజాతుఁ డేని,
బరిభవము నందు, నిర్ధన పురుషుఁ డెపుడు॥ ౧౧

తల్లి నిందించుఁ, దండ్రి సంతసము గనఁడు,
భ్రాత పలుకఁడు, లెంక కోపంబు సేయుఁ,
గొడుకు లెంచరు, కౌఁగిటఁ గూర్పదు సతి,
పొత్తుకాఁడు చేరఁడు, లేమిడి యింతె యెగ్గు? ౧౨

## 9. కృతజ్ఞత

అవసరంబైన వేళ, నీ కాదుకొన్న
పుణ్యులయెడఁ, గృతజ్ఞతఁ బూన, కేలు
దాఁటి, తెప్పనుగాల్చు విధమునఁ, గీడు
చేయ నెంచిన, దైవసహాయ మగునె? ॥ ౧౩

## 10. స్వార్థము

ఎన్ని కఱుపులో కోసితి. నేమొ కాని,
నాకఱుపువలె నొప్పి కన్పడదటంచుఁ
బనవు వెజ్జుగతిక్, స్వార్థపరుఁడు, పరుల
బాధెఱుఁగక, తనదు బాధె, బాధయనును ॥ ౧౪

## 11. తంటమారులు

"తోఁచి తోఁచని యిల్లాలు, దోడికోడ
లమ్మగారింటికిం బోవ, నదియుఁదోఁప
నమ్మ యేఁగెను నాఁడుబిడ్డత్తగారి
యింటి"—కనునట్లు, తిరుగుడు, కట్టిపనియు
లేని తంటాలమారు; లెట్లేనిఁ బొట్ట
నోసికొన వారు, యితరులడాసి, ప్రాఁత
చుట్టఱికమని యేదియొ సుళ్లు వెట్టి
మెక్కుచుం, జుట్లు ముడివెట్టి మిడుకుచుంద్రు॥ ౧౫

## 12. విజ్ఞులు

అఘపంకావిల జీవికేళ్ళు సుకృతం
బంటుగా గడంతేనిఁ ?, దా
ని ఘటింపందరమా పలాండువునకుఁ ?
విజ్ఞులగ్గనంజాలరా ?
లఘుతం బామరమార్గమే కొనెద, గే
లా ? దారు పుణ్యాత్ముల
ఘటింపందారకో రాకప్పాడును వే
లిచన్, లోకరక్షార్థమై ॥

## 13. విద్యలు

అర్థగహిత ప్రబోధ వేదాంతవిద్య,
చరక మేకరువిడుట భైషజ్యవిద్య,
శిక్కు తలకెక్కె వాఁగ జ్యోతిష్యవిద్య,
విద్యలకుఁబట్టె దురవస్థ, వేయునేల ? ॥

## 14. జడమతి

కాలము, కర్మమో, హితము
గా నచియించెడి పెద్దవారి స
న్మాన్యలముచేసి, వారిఁ గనుఁ
గానని క్రొవ్వుసఁ దూలనాడు, నే

బాలిశుఁ, డాతఁ డొందునె శు
భంబుల ? తీరని లోకనిందకున్
మూలములైన కార్యముల
బుద్ధిని జొన్పి గడించుఁ బాపమున్ ॥ ౧౮

అక్కచెల్లెండ్రఁ, దల్లిని, నన్న భార్య,
సకుని యిల్లాలి, నత్త, దేశికునిసతిని,
నిసుగుఁబోరు గమ్మలక్కల, నెనఁడు, దురిత
బుద్ధి—'నసె, వసె' యను, వాఁడు వృద్ధిఁగను నె?॥ ౧౯

మిడిమిడి జ్ఞానముం బడసి
'మించితి విద్యల' నంచు నెంచుటల్
బుడిబుడి నీతులం దెలిపి
బుద్ధిని గీష్పతి నాఁ దలంచుటల్
బడబడ నేవొ వాఁగి తన
పల్కులు వేదములంచు మించుటల్
జడమతి లక్షణంబులగు
సత్సభల న్నుతి వాని కబ్బునే ?॥ ౨౦

## 15. జిహ్వా

జిహ్వాతుదన సిరి యలరును
జిహ్వాతుదన బంధుగులును జెలులెసఁగుదు,
జిహ్వాతుదన చెఱ వఱలును
జిహ్వాతుదన నిశ్చయముగఁ జెలఁగును మృతియున్॥ ౧

## 16. కపటులు

సత్పురుషున్ని, ప్రపానంబు నీళ్ళయందు,
ముసుగు క్రిందను గుమ్మరి పురువు, గడ్డి
మేటియందలి సర్ప, మెప్పాట నెపుడో
బయలుపడి తీరు, తప్పదు భగవదాజ్ఞ॥ ౨౨

టాటోటుగ మట్టుమాయపు
బూటకముల మూటలైన మోటులు పనులం
బాటించి నిలువ మేటులె?
దాఁటి చనం జూతు రాత్మఁ దాలిమి లేమిన్॥ ౨౩

ఆత్మలో విష, మంగిట నమృత మొలుకు
పలుకులు వచించు ఖలుల మాయలకుఁ జిక్కి,
సర్వ మర్పించి, స్వేచ్ఛగ సంచరించి,
కడకు దెసమాలి చెలు లధోగతిని గాంత్రు॥ ౨౪

## 17. బుధులు

ఆపదలయందు మ్రొక్కఁడు, రవి తొలంగి
సంపదలు గల్గ మఱతురు జగతి జనులు;
వారి స్వాభావికము స్వార్థపరతఁ గనియు
నుపకృతియె సల్ప, మది నెంతు, రుర్వి బుధులు॥ ౨౫

# కితవులు

అరగను మోడ్పు, నక్కవిన
యంబు, వికారపు హాసము, స్నమ
స్కారణము మాటి మాటికి, ము
ఖప్రియ వాక్తతి, పై విరాగముం,
బరిజననింద, దొంగ జప
భావము, స్వాత్మమహాత్వశంసయుం
బరఁగెడువాని గేహమునఁ
బ్రాజ్ఞుఁడు సేర్పఁడు సేర్పఁ జెప్పఁకుఁడా।

కడుఁ దీపి మాటల్ముఖ ప్రియస్తోత్రముల్,
చక్కబుద్ధులుఁ, గపటంపుఁ గ్రియలు,
దొంగదండమ్ములుఁ గొంగ జపమ్ములు,
సమితోపకారి యట్లగపడుటలు,
ముసి ముసి నవ్వులు, మొసలి కన్నీళులు,
నక్కవినయాల్, డాబునటనములును,
జిడ్డు చేవదలని దొడ్డ పెత్తనములు,
దాన ధర్మాలన్న మానగతులు,
ప్రకృతి సిద్ధగుణమ్ము లెవ్వనికి, వాఁడు
మాతృ పితృ దైవతమ్ముల మఱచునన్నఁ
బంగనామము పెట్టఁడా? పరుల, కట్టి
పశువునకు దక్కునే? యిహపరసుఖములు।

అంధుఁడా? విశ్వేశుఁ, డరుదెంచు వారల
యఘసమూహమ్ముల నరయకుండ,
గ్రుడ్డియా? రామేశ్వరుండు, వచ్చెడు మను
జుల దోసఁగులరాశిఁ జూడకుండ,
చీఁకువా? తిరుమల శ్రీపతి, యేతెంచు
జనుల పాపావళిఁ గనకయుండ
నేత్రహీనుఁడె? కాంచినేత, డాసినవారి
కలుషపుంజమ్ములఁ గాంచకుండఁ
గాతవ్రుఁడా! మున్ను సల్పిన కీడులెల్ల
దాఁచఁగల, వింత నరులకుఁ దోఁచకుండఁ
గాని సర్వజ్ఞుఁడగు దేవుకనులు గప్ప
చాలు గాదయ్యా! మన్నింప వేఁడుమయ్యా!॥

క్రుళ్ళు పొట్టను బెట్టుకొని కాశికేఁగెడు
కట్టెకు మోక్షంబు గగన సుమము,
అసమానమతిఁ గల్గి యాసేతువుం జేరు
దేబెకు సుగతి కుందేటికొమ్ము,
కడు నసూయత గ్రుడ్లఁ గ్రక్కుచుఁ గంచికిఁ
బోవు పీనుగు దివి ముసిఁడి తీపు,
ఓర్వలేమిని దాల్చి యొడలెల్ల ద్వారక
కేఁగు పందకు ముక్తి యిసుమునూనె
అత్యసంతుష్టి గలిగి ప్రయాగకుఁ జను
మలప కపవర్గ పద మెండమావి నీరు,
కానఁ జిత్తవిశుద్ధి నెక్కడకుఁ దిరుగ
కింట నుండియె జ్ఞాని సాధించు ముక్తి॥ ౮

తన పక్షపాతవాద మాత్రయిలోని సూత్రంబు
లాంతి శాస్త్రోక్తి నయేతరంబు,
తన రక్తబంధులెల్లను దూషణార్హులు
అన్యదురాత్ములు మాన్యతములు,
తన దుష్టదార యత్యంత పతివ్రత
పరు సహధర్మిణి దురిత చరిత్ర,
తన రాగిదమ్మిడి కనకాద్రి రాచెక్క-
పెఱల బంగరుకాసు పెంకుముక్క,
గాఁగ నెవ్వఁడు దలఁచు నా కలుషరతున
కిహముఁ బరమును గలుగునె ? యెంతచేసి
బాహ్య కర్మలఁ జేసిన, భావశుద్ధి
యించుకయులేక యవి ఫలియించు నెట్లు ? ౫

ప్రాయశ్చిత్తము లేదులేదు పరదా
రామర్శ దుశ్శీలికిన్
న్యాయాన్యాయ విహీనబుద్ధికిఁ బరా
ర్థాకర్షణోద్యోగికిన్
శ్రేయోదాయకహృన్మహార్య జనతా
నిందాపరస్ఫూర్తికిన్
భూయోధర్మ కృతి ప్రియాత్మునకు నె
వ్వేనిం బాహ్యకర్మంబులన్ ॥ ౬

# చెలికాఁడు

నిను ముఖస్తుతి నొనరించు జనములెల్ల
కష్టముల కాదుకొను చెలికాండ్రు గారు,
గాలివలె మాటలును గడుఁ దేలికలగుఁ
గాని నిక్కపు మిత్రులఁ గాంచు టరుదు॥ ౧

న్యాయమొనర్పఁగ ధనమున్న యపుడు నీకు
సందఱును మిత్రు లగు టేమి సందియంబు ?
కాని, ద్రవ్యార్జనము దక్కనైన యపుడు
ఎవ్వఁడును నీకుఁ దోడ్పడ నెంచఁ డింత్రు !॥ ౨

అవసరంబైన వేళ సహాయపడెడు
వాఁడొకండె సుమీ నేస్తకాఁడు నీకు
నాతఁడార్తిని గుందు నీ వార్తిఁ గుంద
నీవు మేల్కొన నాతఁడు నిద్రబోఁడు॥ ౩

నీ విపత్తుల నన్నిఁటి నిశ్చయముగఁ
దనవిగా నెంచి, నీకయి వనఁటఁజెందు
మొగమెదుట నుతి సల్పెడు మోసకాండ్ర
యందు నిజమిత్రు నిట్లరయంగ వలయు॥ ౪

—(సెంటుపాల్సు హైస్కూలు మ్యాగజైను).

# సాధ్వులు

అమరులు వెఱగంద నాత్రిమూర్తులను ని
సుఁగులఁ జేసిన యనసూయ యొకతె,
యంతకు వేఁడి నిజాధిపు జీవముల్
వెసఁ దెచ్చినట్టి సావిత్రియొకతె,
యాత్మేశు రక్షణకై సూర్యు నుదయమ్ము
మాన్పిన కౌశికు మగువ యొకతె,
దిక్పతుల పరీక్షఁ దేఱి వల్లభు వివా
హంబైన యాదమయంతి యొకతె,
భర్తృ సత్యవ్రతావన పరత మెలఁగి
శ్రమల నెన్నియొ కనిన చంద్రమతి యొకతె,
మఱియు నెందఱో సతుల జన్మముల మివులఁ
బ్రతిభఁ గాంచెను జగతి నీ భరతభూమి ॥ ౧

ఎంచన్ మదిని, నహల్యన్
బాంచాలిం, దారఁ, దార, మండోదరి, శీ
లాంచిత ధన్యలఁ, గన్యలఁ
బంచసతుల, సంచితోరు పాపము లడఁగున్ ॥ ౨

(గృహలక్ష్మి)

---

# పతాకము

ఏ పతాకముఁ గాంచి యింగ్లండు దొరలెల్ల
నస్థిలో జ్వరమంది యదలినారొ,
ఏ పతాకముఁ జిరస్థాపన మొనరింప
నాయకు లిక్కట్ల నలిగినారొ,
ఏ పతాకముక్రింద నెందఱో భారత
వీరులు ప్రాణము ల్వీడినారొ,
ఏ పతాకపు వెల్గుఁ జేపట్టి హైందవుల్
స్వాతంత్ర్య మార్గాన జరిగినారొ,
యట్టి భారత జాతీయతాధినేతృ
భావచిహ్న త్రివర్ణితోజ్జ్వల పతాక
మొగురఁ గంటిమి, 'రెడ్ ఫోర్టు' కెగువ మింట——
జయజయారావ మెదవొంగ సలుపుమయ్య! ॥

ఆయశోక ధరాధినాయక బౌద్ధధ
ర్మ ప్రతిపాలనమహిమఁ దెలుప,
గాంధి మహాత్ము చార్ఖామీఁది యాదరి
భావంబుఁ బ్రజలలోఁ బాదుకొల్ప,
శిష్టరక్షణ దుష్టశిక్షణముల సల్పు
విష్ణు చక్రంబు జ్ఞప్తికిని దేఁగ
చిర దాస్యతిమిరంబుఁ బరిమార్చు స్వాతంత్ర్య
భానుబింబ మటంచుఁ బ్రకటపఱుప

భారతాశేష జాతీయ వీరలక్ష్మి
యధివసించెడు నబ్జ సింహాసనమునఁ
జక్రమ! త్రివర్ణపుఁబతాక మాక్రమించి,
కన్నతల్లివలె నన్నెమ్ముఁ గానవమ్మ! ॥ ౮

దుమ్మున్న ధూళి గ్రుంగితివి,
దుర్దమ శాత్రవ పాదఘట్టనం
గుమ్మయిపోయి, తాత్మసుత
కోటుల చిక్కనిరక్తపుం బ్రవా
హమ్మున మునిగి తేలితివి,
హాస్యవహాస్యల కగ్గమైతి, క
ష్టమ్ములు వోయి, నీ కెసఁగె
శాంతి, త్రివర్ణపతాకరాజమా! ॥ ౯

# క్విట్టిండియా

ఓర్మిం గూర్మియు సూపిచూపి, తుదఁ దా
నోర్వంగ లేకే సుఁడీ
ధర్మాత్ముండు, మహాత్ముఁ డూఁదె, నిదె చిం
దం బిష్ట "క్విట్టిండియా"
'మర్మం బొక్కటె దేశదాస్యముఁ ద్రోలం
పన్ సాధనం' బంచికం
జేర్మిం జేకొని లెందు లెం, డణఁపుఁడీ
విద్వేషులం, దోషులన్ ॥ ౧

సాము, మహింస, సత్యము, వి
శాలమనంబు, ఋజుప్రచార, మీ
గామిడీ యాంగ్ల రాక్షసుల
కంటిపాఱ ల్దోలఁగింప, ప్రజ్వలో
ద్దామ మహార్య భారత సు
తక్రమ వీర భుజావిజృంభణం
బే, మహితౌషధంబు ద్రోలఁ
గింపఁగ దానిఁ, గడంగుఁ డిత్తఱిన్ ॥ ౨

ఎంతటి నిశ్చలాత్మ ధృతి
వింతయు జంకక దేశదాస్య దో
షాంతక తీవ్రయత్నమిపు
డౌనని పూనితి వాంగిలేయుడు

ప్రాంతబలం బెఱింగియు, ఋ
తంబు నహింసయు శాంతమన్ త్వదా
శాంత లసన్మహాయుధము
లార! ధరించి, మహాత్మ! యుద్ధతిన్ ॥ ౩

భారతదేశమాతృ చిర
బంధన దుర్దశ వాపనెంచి, గం
భీర మనః ప్రవృత్తి నెల
మిం దమప్రాణము లే నొసంగ, ద
ద్వీరతనూజ వర్గమిదె
తెంపున ముందడుగుంచి, రింక, నే
తీరున నాంగ్లులార! కడ
తేఱునొ, మీ యధికారగర్వముల్ ॥ ౪

# మహాత్ముని నిర్యాణము

ఏ పాపంబు నెఱుంగనట్టి నిను, నెం
తేఁ బాపభూయిష్ఠుఁడై,
బాపం డంటు, వచింప సిగ్గగు, నఖ
ర్వద్రోహచింతాతి గ
ర్వాపేతుండయి, కాల్చిచంపెన కటా, య
య్యో! యింత దౌర్మార్గ్యమా?
బాపూజీ! జనకుండు భారతుల కె
వ్వండింక నీవేఁగినన్ ॥ ౧

సత్యాత్మ బలమింత వ్యత్యయం బగునంత
స్వాపరాధంబని సంతపించి,
యన్యహింసనము రవంత కల్గినయంత
స్వోద్యమదోషమం చోగిఁ ద్యజించి,
ప్రజలలో శాంతికి భంగమేర్పడినంత
దానిఁ బోకార్ప నెంతేనిఁ గుంది,
దేశైకమత్య మస్థిరతఁ గాంచినయంత
నుపవాసములఁ బ్రాణ ముగ్గఁబట్టి
హరిజనసమస్యఁ దీర్ప సౌఖ్యములువిడిచి,
భారతావనిసేవయే పరమకృతిగఁ
బండుముసలితనానను బాటుపడితి
వరిగితివె? యింతలోన, మహాత్మ గాంధి ॥ ౨

కడుపు చుమ్మలుచుట్టి గగ్గోలుపడి యేడ్చు
        భరతాంబ కేమని పలికితయ్యా,
కుప్పగాఁగూలి దిక్కులు దోఁచకున్న జ
        హ్వారు పండితున కేమి పలికితయ్యా,
వెలవెల వార్మోము మలఁచి కన్నీర్నించు
        నల 'యజాదు'న కేమి పలికితయ్యా,
దిగులంది చిత్రప్రతిమవోలె నిలిచిన
        వల్లభాయికి నేమి పలికితయ్యా,
గుండె నీఱయి లోననే కుములుచున్న
ప్రభుఁడు 'మౌంట్ బేటను' న కేమి పలికితయ్యా,
క్షణములో నెల్లరను విడి చనితె తండ్రి!
అఖిలసద్గుణాకంధి! మహాత్మగాంధి ॥ ౩

చల్లని శాంతరసంబుఁ జిల్కెడు భవ
        దాననాంబుజ మింక నరయఁగలమె ?
కమ్మని కరుణామృతమ్ముఁ జిమ్మెడు భవ
        దాలోకనము లింక నరయఁగలమె ?
యమలాంతరంగ భావానందభర భవ
        ద్దరహాసమింక, మేమరయఁగలమె ?
సత్యశాంతి సమత్వ సారబోధక భవ
        దురు రచనము లింక నరయఁగలమె ?
పరమపూత భవత్పద భద్రముద్ర
లిరవుకొను చోటు లింక మేమరయఁగలమె ?
పోయితివె చీఁకటిని మమ్ము ముంచి, తండ్రి!
అఖిలసద్గుణాకంధి! మహాత్మగాంధి! ॥ ౪

# జవహర్లాలు

అవురా! యే జనలోక నాయకునకే
నత్యాదరం బొప్ప, గా
రవ మీరీతి నశేష భారతులు గూ
ర్పంజాలి రే? మాతృ దా
స్యవినాశం బొనరింప నేజనుఁడు నీ
యట్లార్తికిన్ లోఁగెనే?
జవహర్లాలుబుధేంద్ర! నీ జననమే
స్తవ్యంబు, ధన్యంబిలన్ ॥

మకుటంబొక్కటి లేదు, కాని జనతా
మాన్యాతివర్చస్సు, పా
లకమాహాత్మ్యము, నైతికోత్పథగతుల్
లావణ్యమహామేను, ది
వ్యకలాస్తోకధురంధరత్వమును, రా
జ్యాంగప్రబోధత్వ, మిం
కొక-వోటుం గనఁబోము నీయెడ వినా
యుర్విం బుధారాధితా! ॥

ప్రథితభాగ్యవతి స్వరూపరాణియు సుమి!
కడుపుచల్లఁగ నీవంటికొడుకుఁ గనుటఁ,
తల్లులెందఱు లేరు హైందవధరిత్రి?
నూట-వేయింట నామె కేఁబోఁటి సాటి? ॥

'ఎదలో మెత్తందనమును
వదనమ్మునఁ గ్రొత్తఁదనము, వాక్కులఁ గ్రొచ్చెలుం
గొదలేని పొత్తుఁదనమును,
బొడలు నితని' కనుచు నిన్నుఁ బొగడుదురాప్తుల

దాస్యపిశాచకృత ప్రమత్తాంధత
స్వేచ్ఛాంజనమునఁ జూపించినావు,
స్వల్పసాంఘిక పథాచారులఁ 'గాంగ్రెసు
హైరోడ్డు'పై నడ్వఁ గోరినావు,
పాలకపాలితవర్గ భేదంబుల
కద్వైతభావంబు నదికినావు,
స్వార్థచింతాపరుల్ పనివారలకుఁ గట్టు
కఠినవాగ్బంధముల్ గడపినావు,
సామ్యవాదముఁ దెల్పి భూస్వాములకును,
ప్రజలకుంగల యంతర్వు వాపినావు,
కాంగ్రెసాజ్ఞల బోధింపఁ గడఁగినావు.
వరయశస్సాంద్ర! జవహరు పండితేంద్ర! ॥

'సిమెంటు' ఘట్టించు భూమిలోఁ 'గాంగ్రెసు'
బీజముల్ చల్లి మొల్పించినావు,
అనితరాసాధ్యమౌ ఘనరాజ్యతంత్ర మూ
హించి 'హైరోడ్డు' వేయించినావు,

ఆదర్శజీవిత వ్యవసాయనౌకకు
మించుచుక్కానిఁ గట్టించినావు,
సత్యసంస్థాపన మత్యవసరమని
యెంచి, పునాదు లెత్తించినావు,
బలిపశువయి దేహమర్పించినావు,
ఘనమహార్ఘానఁ బ్రజల నర్చించినావు,
దేశసేవావిధులను బోధించినావు,
జహ్వాటబుధాగ్రణీ! సువిజ్ఞానతరణీ! ॥ ౬

మాంటు నుడికారముసఁ జేసె తేఁటు లోకంబుకై,
బహుళ రాజ్యాంగ తత్త్వమ్ము బయటఁబెట్టి
నవచో వైభవాతి నిర్నిద్రశక్తి
హైందవాళికి మేలుకొల్పగును జుమ్ము ॥ ౭

కారాగార వినష్టదేహులకు, నాం
గ్ల ప్రోద్బలక్రూర సం
స్కారానీతవిభిన్నగేహులకుఁ, బ్రా
గ్రాజ్యప్రభాసంస్థితో
బాగాధారుల కీ మహోద్యమసుధా
ధారా సమాస్వాదనం
బారా! త్వత్కరుణా ప్రసాదితము కా
దా! జహ్వారార్యాగ్రణీ! ॥ ౮

'కలగుండుపడిన దేశం
బలవోక స్వరాజ్యసౌఖ్యమందఁదగు కృషిఁ
సలిపి యెటు లుద్ధరింతువో
నిలుకడగా నిలిచి' యని గణింతుము మదిలోఁ ॥ ౯

మొక్కవోవని ధైర్యంబు, చెక్కుచెదర
నట్టిభావంబు, సునిశితంబైన దీక్ష
వెనుకడుగులేని గంభీర వీరగుణము,
జన్మతోఁబుట్టినవి నీకు జవ్హారేంద్ర ! ॥ ౧౦

ఫలితముల నెవ్వఁడెంచు ? నీపట్టినట్టి
పట్టునందు జయాంకము పరిఢవిల్లుఁ
గృషియొనర్చుట నిష్కామవృత్తిఁగాదె ?
సహజకారణజన్ముల సత్వమిదియ ॥ ౧౧

తండ్రినినిర్మించు బిడ్డఁడితఁడని జగము
పొగడ, దేశీయసభ నిల్చి, మునుముకొనిన
దేశదాస్య విశృంఖలల్ త్రెంపఁబూని
శౌర ! నిజమనశ్శక్తిమై నద్భుతముగ ॥ ౧౨

'జవహరులాలు పండితుఁ, డ
సాధ్యవచశ్శరవృష్టిపాతసం
భవ నిఖిలాంగ్లరాజ్యవిభ
వ ప్రతికూల కళాకలాపుఁ, డా

త్మవిజయశీలుఁ డంచిత స
మాన విధాప్రథఁ గన్న వాఁడు స్థైరం
ఘనజన కల్పకంబయి యు
దారతఁ బ్రోవఁగఁబూనె నర్మిలిన్ ॥ ౧౩

అతనిఁ దడవఁగఁ బనియేమి ? యతనియంద
యిమిడియున్న మహాజ్యోతి నెన్నవలదె ?
యెంచు, దలపోసి, ప్రజనిశ్చలాత్మవృత్తి
నెలఁగుదు రతని యడుగుజాడలనుబట్టి ॥ ౧౪

వ్యక్తిగతబాహ్యచిహ్నాళి వలననేమి ?
యతనియందున నిమిడి వెల్గారుజ్యోతి,
మహిమ, ధైర్యము, శక్తియ మానుషములు,
ఖండఖండాంతరవ్యాప్త గౌరవములు ॥ ౧౫

# మాలవ్యాజి

ఆర్యశాస్త్రాచార మసిధారవ్రతమున
　　నాచరించిన బ్రాహ్మణాగ్రసరుఁడు,
దేశదాస్యమువాప దీక్షమైఁ బోరాట
　　మొనరించి నట్టి వీరోత్తముండు,
విద్యాభివృద్ధికై విశ్వవిద్యాలయ
　　మును నెలకొల్పిన బుధనుతుండు,
భారతీయైక్యభావంబుఁ జేకూర్ప జీ
　　వితము నర్పించిన విమలగుణుఁడు,
హిందుజాత్యుద్ధరణకయి నిశ్చలముగఁ
బాటుపడినట్టి విఖ్యాత పండితుండు,
మనపితామహుఁడు, పతితకృపాధనయుతుండు,
మదనమోహన మాలవ్య మనకు లేఁడు ॥

---

# శృంగారము

## (సాంత్వనము)

సుందరి! యరవిందముఁ దెగ
డందగు నీమోము వాడుటం, దిగులొందెం
దెందము, కుందఁగ నేలా?
యిందీవర నయన! తెల్పవే? ప్రణయమగుచు౯ ॥ ౧
సుందరి! కుందన మందము
నుం, దూఱు భవల్లసత్తనూలసణశేము, కెం
దుం, దుల గలదే?, యది సొం
పుం దఱుఁగఁ, గతంబదేమి? మోహనగాత్రా! ౨
చిందము నీగళ, మల యర
విందము నీ వదన, మళులబృందము కురులుం,
గుందముల వరుస పలుచా
ల్సుందరి! యవి మెఱుఁగు దఱుగఁ జూడందగునే॥ ౩
అందము చందము, గందము
నందగు సుందరియె యెందు నాకగపడ, దీ
నందఱినిం దలఁదన్నుదు
సెందిగు లిటుగూర్తువేల? వెలఁది! మదికి౯ ॥ ౪
మందము నీగమనం, బే
మందము నీ యిందువదన మందము?, పలతే
మం దముపోలఁతులఁగన, రా
నందన వనచారి దేవనారులు గీకుచ౯ ॥ ౫

పొందళుకు మేని సొబగున,
నందంపుంగులుకు నడల మదిరేక్షణా! స
న్నుం దరిసినఁ గవుఁ జంద్రిక
లం దోఁగం, కరుణచిప్పిలం గృపఁ గనుమా! ॥ ౬

సుందరి! ప్రణయానందము
పొందము నిండఁగ, మదించెడిన్మదనుఁడు, వా
సిం దండింపఁగ, మనకిం
కం దగదే? జాలమేల? కనలఁగవలదే! ॥ ౭

కందని కెందలిరాకుల
కందని కోపులతో నంది, కన్దోయికిఁ న
న్పొందనికిం చెడు బాహుల
సుందరి! ననుఁ గౌఁగిలింపఁ జూడవదేలా? ౮

కుందనపుఁ దళుకు గిండుల
యందపుఁ జన్దోయిఁ గల సుధాలోకనముల్
బొం దెంజిక్కు చకోరము
లం దలపించుచుఁ గడుం దలంకెదు గనవే? ౯

సందిటఁ జేర్పవె? యెదకా
నందము నందింపవే ఘనస్మరతాపం
బుం దొలఁగింపవె? నీయర
విందపదంబులకు మ్రొక్కి వేఁడుదు; సుమతీ! ॥ ౧౦

## కోపన

అల్లిన వేనలిం దోఱఁగి
యంతట నంతటఁ బూలురాల్పఁ, జ
ల్లల్లన ముంగురుల్ గునిసి
యాడ ముఖాంబుజమందుఁ, గావిచె
క్కుళ్ళను గ్రమ్మఁ, గెంబెదవి
కీడ్పడి కంపమునొంద, మిన్కురుల్
స్రల్లెడు నల్కచూపుల ప
సందగు నీసొబగెంతొ సుందరీ ॥ ౪

## నిరాదర

నను బిగి చిన్ని నవ్వువచ
నుంగవ యక్కున నిక్కిచూచుచున్
మనసునఁ దాల్మి వోనడంచి
నం, గలవెంతయు నీదుచూపులం
చనుకొని ధైర్యమూన, నిపు
డయ్యవియుం గఱవయ్యెఁ దేనెలం
జిలికెడు పల్కుఁ బల్కవ లె
నే? యిఁక నెక్కడిదయాస సుందరీ ॥ ౫

## ప్రణయిని

అరవిరితమ్మి నిగ్గులకు
నాఱడిఁ గూర్చెడి కేలుగేలితోఁ
బెరయుఁగ, సంజమబ్బు తెఱ
వెన్కమఱుంగిన యిందుబాలుఁడుం

గగలుచుఁ, దొంగితొంగి మస
క్రేవఁ గనుంగొని నవ్వఁ బుష్పసం
జనుల లతాకుడుంగముల
చాయల రంజిలు కుంతు సుందరీ ॥

## విదగ్ధ

జిలిబిలి తేనెతుంపురులొ,
జిల్లను కప్రపుఁదునుకలో, కడుం
జలుజలు జల్లువెన్నెలల
జల్లొ, సుధారసశీకరమ్ములో,
నలనల కండచక్కెరల
పల్కులో, యిక్షురసంపు సోనలో,
తెలియఁగఁ జాలఁ, జెల్వగు మ
నం గఱఁగించెడుఁ గల్కి పల్కులన్ ॥

## ప్రౌఢ

చూపుఁదూపులవాఁడి యోఁపుచూపుట లెల్ల
నునుసిగ్గు మొలకలు పెనఁగుదనుక,
విప్పులతోఁ గనుబొమ్మ విఱ్ఱవీఁగుట లెల్ల
నుదుటుగుబ్బల తోఁపు లోఁదవుదనుక
పలితంబులౌ పిఱుందులు పెంపుఁగను లెల్ల
నెఱివేణి బలుహాతుల్ నెఱయుదనుక
పృథులోరుకాండముల్ మొఱఁగులీనుట లెల్లఁ
గలహంసయానముల్ గదుపుదనుకఁ

బోటుపాటుగ హృదయానఁ బొంగిపొరలు
ప్రణయమునఁ గ్రుమ్మ్మలాడు భావమ్ములెల్ల,
మించి దండెత్తి మరుఁ డరుదెంచు దనుకఁ
గాక, గర్వమ్ము విడనాడవే, నవోఢ ! ॥

### ప్రౌఢ

చూచియుఁ జూడనట్లు గడు
    సుందర మేర్పడ, నోరఁజూచెదున్
అఁచియు నాఁచనట్లు దర
    హాసమొనర్చెదు వింతసిగ్గునన్
దోఁచియుఁ దోఁచనట్లు చను
    దోయిని గప్పెదుఁ బైఁటచాటునన్
నాఁచియు నాఁచనట్టిదె మ
    నంబును లోఁగొనుఁ గొంత సుంతలోన్ ॥

### ముగ్ధ

మధువేళఁ బికకాంత సుధలొడిగిలఁ బాడు
    టిది దాని తప్పా ? యీయిగురు తప్పా ?
నీరదాగమమందు నెమ్మి నృత్యమొనర్చు
    టిది దాని తప్పా ? యంబుదముతప్పా ?
బాలభానునిరాకఁ బద్మిని వికసించు
    టిదిదాని తప్పా ? యీరెండ తప్పా ?
పున్నమరేయి సముద్రముపొంగుట
    యిదిదాని తప్పా ? పూర్ణేందు తప్పా ?

నవనవోన్మేషమగు యౌవనమునఁ గన్నె
లలితశృంగార భావములకు మెఱుంగు
వెస్ర నునుసిగ్గు దొంతర్లు వెలయుచెదియు
దాసి తానో ముగ్ధవయస్సుతనో ? తెలుప ॥ ౧౧

## దేవదాసి

పట్టుపుర్ వస్త్రమున చన్నుదోయి 'సిలుకుం'
బంగారు 'జాకెట్టు' నన్
సటిమియింపం, జిగిరత్నహారములు వి
న్నాణంబుగా నూఁగఁ జె
మ్మట బొట్టిల్ నుదుటం గపోలములఁ గశిన్
మంచుంబలెన్మించ, ను
త్కటపటూ నూర్పులఁ గార్శ్యమధ్యము గడుం
గంపింప, సంధ్యారుణ
స్ఫుటవర్ణప్రతిమాన పల్లవపదం
బుల్లండఁగా, నెన్నడన్
వోటుకుల్ దోఁపఁగ, మెట్లపై నటునటున్
దూఁగాడుచుం, జోగు, చె
ల్లెటులో నొవ్వుచు, నుంతనిల్చి, చాటుఁ ది
న్నిక్షించు గోవాళ్ళ లం
పటవారించుచు, శ్రాంతిఁ గైకొనుచు, నా
హ్వానించుచుం దల్లియు
ల్లటు వెన్కంబడిరాఁగ, దానిఁ గన మో
మావంకకుం ద్రిప్పుచున్,

ఘటకంబుల్ మణినూపురంబులును గ
ల్లల్లించు మ్రోగంగఁ, బ
య్యోటఁ జక్కన్ సవరించుకొంచు, విచల
ద్భ్రూగ్రోచులన్ దిక్కులం
తెట వ్యాపింపఁగఁజేయుచుం, జటులకం
దర్ప ప్రమత్త ద్విపం
బటు, వేదాద్రివిభుం భజింప, గిరి స
త్యాసక్తిమైనెక్క చా
క్కటపుం బుత్తడిబొమ్మసొంపు యువహృ
త్కంజంబు లుఱ్ఱూఁచెడున్ ॥ ౧౧

## విద్యార్థిని

ఆ నునుసోగపుం గురుల
నరదపు ముచ్చట జాఱుక్రొమ్ముడిం
గా నలరించి, యా పయిని
గమ్మని మల్లెలఁ జంద్రరేఖ యు
ట్లూని, 'జపాను' పచ్చ'సిలు'
కూఁగఁగఁ గుచ్చెలు దీర్చికట్టి, పం
తానఁ బయోజపాళిబిగి
దాఁచి, సగంబు సగంబు మూఁపులుం
జానవు బాహులు న్మెడయుఁ
జంచదమేయ నిజాతికాంతులం

బూనిక బైటవేయు తెలి
పూవుల 'జంపరు' లోన 'బాడి' యెం
తే నవకానఁ దాల్చి, యెద
నించుక వ్రాలు పయంటయంచులం
నైనముగాఁగఁ జేర్చి జిగి
బంగరు 'పిన్ను'నఁ గుచ్చి రత్నపుస్
'చై' నొకపేట చన్నుఁగవ
సందునఁ జిందులు ద్రొక్క, 'రిస్టువా
చీ'ని నిగారమొప్ప నెడ
చేతధరించి, యొక్కొక్క కంకణం
బే నెఱపొప్పఁ దాల్చి చల
వీక్షణ రోచులఁ గోటికాండ్రకుల్
మానసముల్ గడుం గలఁచి
'మానవహృత్పరిశోధనాళముం'
బూని గళమ్మునం, గరున
పున్నడ నడ్డుల 'నాకుఁజెప్పలుల్
మానుగఁ 'బట్పట' ధ్వను ల
మందముగా నొనరింపఁ, గూనురా
గాన్న నెదేనిఁ బాడుచు, ని
కామముదంబున, వైద్యశాస్త్రబో
ధానిలయమ్ముఁ జేర వని
తామణి యొర్తు త్రిలోకమోహనా

దానసురూపకాంతి జిత
దైవత కాంత, స్మితప్రభాస, చం
ద్రానన నేత్రపర్వముగ,
వద్దిర! యోఁగెడుం గీలుపాకునట్ ॥ ౧౨

## క్రీడాసక్త

మోమునఁ జిఱునవ్వు పూలుపూచిన నేలఁ
బండువెన్నెల నిగ్గు నింపఁ బఱచి,
నిట్టూర్పుగాడ్పుల నీటు వాటిలుచోటఁ
గమ్మని నెత్తావిఁ గడలు కొలిపి,
నీలాలచూపుల చాలు వ్రాలినసీమ
భ్రమరపంక్తుల తోరణములు నిలిపి,
లత్తుక పదము లలంకరించిన వంక
నెత్తామరల పంట నెగడఁజేసి,
పైఁడియంచుల చెంగావి పైఁటకొంగు
కుసుమకోదండు 'బావుటా' గుడ్డవోలె
కేవి నెగురఁగ నందెలరావ మెసఁగ
బంతులాడెడి సతుల మేల్బంతిఁ గంటి ॥ ౧౩

## రసికత

లంబకుచ యిచ్చు నాలింగనంబు కంటె
లికుచకుచ పాదములతాఁపు సుకమొసంగు
సరసికుండిచ్చు ఘనతరాదరముకంటె
రసికుని యనాదృతియె మదికొసఁగుఁ దృప్తి ౧౪

(గృహలక్ష్మి : జూన్ 1952)

# త్రాగుడు

త్రాగుఁబోఁతుఁదనంబుచేఁ గదా, శుక్రుఁడం
తటివాఁడు ప్రాణాంతికవిపత్తును బొందెఁ,
త్రాగుఁబోఁతుఁదనంబుచేఁ గదా, బలుఁడను హా
లమ్మున యక్కి శీర్షమ్ముఁ ద్రెంచెఁ,
త్రాగుఁబోఁతుఁదనంబుచేఁ గదా, 'లోతు'ను
వాఁడు కూఁతును బల్మిఁబట్టి చెఱచెఁ,
త్రాగుఁబోఁతుఁదనంబుచేఁ గదా, యల 'జహాం
గీరు' స్త్రీలోలుఁడయి కీర్తిఁ బాసెఁ
త్రాగుఁబోఁతుఁదనం బందుచేఁ గద భూమి
బుధులు పంచమహాపాపముల నొకటిగఁ
జేర్చిరి, నరుఁడయి యుద్భవించి నట్టి
వాఁడు, దానికి వశుఁడైనఁ బ్రదుకఁగలఁడె?

# జారుడు

తనభార్య నంగడిఁ దాకట్టుపెట్టి, లం
    జియలఁ బొందఁగఁ జూచు చెడుగొకండు ;
తనతోడఁబుట్టువుం దార్చిచ్చి, తాపిక
    త్తెలకొంగుల స్నింపు ములుచ యొకఁడు ;
తనతల్లి జంకాడి, కనినసొమ్మున విలా
    సములఁ గైసేసెడు కుమతి యొకఁడు ;
తనకూఁతు వాడవదినెఁ జేసి, విటచేట
    కాదులఁ బ్రోచు నంబేద యొకఁడు ;
స్వాభిమానంబు నాభిజాత్యంబు నంగఁ
గలిపి స్వేచ్ఛానుసారులై మెలఁగఁజూతు
రకట ! పశువులకంటె మహాధములుగ
మానవత్వము హృదయములేని నరులు ॥ ౧

పరకాంతలను దేఁకి పాఱఁజూడఁదలంచు
    చపలస్వభావుండు 'సైట్లు' విధవ,
పాఱఁజూచి మృగాక్షి భావంబెఱుంగక
    కూడ నెంచెడువాఁడు కోంటువిధవ,
కూడ నెంచి కుటుంబ కులిశయత్నమ్ములు
    చేయఁ బూనెడువాఁడు చిలిపి విధవ,
చేయఁబూని యశమ్ము మాయ, నల్గురినోళ్ల
    బడు నకృతార్థుండు పంచవిధవ,

# శాస్త్రి

శాస్త్రము పేరునే వినని
జాల్ముఁడు, శాస్త్రమెఱింగినట్టిదుర్
శాస్త్రులె తైరి, యెవ్వరిఁక
శాస్త్రిలుగాని యభాజనుల్ కలిఁగ్,
శస్త్రముపేరు సెప్పిననె
క్షత్రియుఁడౌనె?, యె వేనిముక్కలన్
నిస్త్రప నెళ్ళఁబెట్టి, యగు
నే భువి శాస్త్రియుఁ, బండితుండు?; శా
వస్త్రము మాటునం బొలుచు
వజ్రము ఱాయగునే?, నిజమ్ముగా
శాస్త్రమెఱుంగువాఁడు దన.
సత్ప్రభఁజాటునె శాస్త్రిపేర?, పెన్
భస్త్రినిబోలుబొజ్జ, వద
నంబునఁదీర్చిన బూదిరేకలున్
దస్త్రముచంక, సాల్వఁ దలఁ
దాల్చి, మెడన్ రుదురాకలూను శే
శాస్త్రికిఁ జిన్నెలైనయెడ,
శాస్త్రియెసూ, 'డబుడక్కివా'డిఁకన్ ॥

# నల్లి

కొల్లలొల్లలుగాఁగ జీవములు పె
క్కుల్లల్ల, నీవేల, జే
ఝల్లం గూర్పఁగనీక, మానవులనే
హింసించి, తద్రక్తపా
నోల్లాసంబున జీవికం గడపఁగా,
నుంకింతు వున్మత్తతన్
నల్లీ! నాదెసరాకుమా, నిదుర మా
న్పంబోకుమా, మ్రొక్కెదన్ ॥

నల్లం ద్రావుటచేఁ గదా, జనులు నిన్
'నల్లీ'—యనం జాగి, రా
నల్లం ద్రావక యుండలేవొ?, బ్రదుకన్
నానావిధాహారముల్
నల్లన్మించిన వింకలేవొ? యిటు నిం
దంబొంద నీకేలనే?
నల్లీ! నాదెసరాకుమా, నిదుర మా
న్పంబోకుమా, మ్రొక్కెదన్ ॥

మెల్లం బాపలపాల నెత్రు, మదపు
న్మేన్వారి నెత్రుల్, గదున్
వెల్లం బ్రాకిన దేహముల్ గలుగు నా
వృద్ధాళి నెత్రుల్, గటా!

చల్లంగాఁ గడుపారఁ గ్రోలుదువు నీ
సామర్థ్యమాశ్చార! యో
నల్లి! నాదెసరాకుమా, నిదుర మా
న్పంబోకుమా, మ్రొక్కెదన్ ॥ ౩

భల్లూకంబులు దేనెఁగోరుఁ, జెఱకుం
బాల్గోరు మాతంగముల్,
పిల్లుల్ పాలనుగోరు, మక్షికములున్
వేగోరు చీముల్ సదా,
క్రుళ్ళున్నెట్టినిగోరు దోమ, లిఁక నె
త్తుంగోరుదీవో, కటా!
నల్లి! నా దెసరాకుమా, నిదుర మా
న్పంబోకుమా, మ్రొక్కెదన్ ॥ ౪

'రైళ్ళన్', 'రిఫ్రెషుమెంటు రూములను', వై
ట్రర్లన్ 'హోటేల్ రూములన్'
'స్కూళ్ళన్', 'హాస్టలురూము'లందు, వెయిటిం
గ్రూమ్లుందుఁ, గాన్పింతు, వె
ల్లెల్లన్ 'రామ'మయంబొ, యట్లె జగమ
య్యెన్ నీమయంబౌర! యో
నల్లి! నాదెసరాకుమా, నిదురమా
న్పం బోకుమా, మ్రొక్కెదన్ ॥ ౫

(థియొలాజికల్ హైస్కూలు మ్యాగజైను)

---

# తిరుక్కళికుండ్రము

ఏ నెలందుల్ విశేషము తి
రుక్కళికుండ్రమునందు మున్నటం
చే వినియుంటిఁగాని, వెల
యింతులో, సాధ్వులో, నేఁటివార, లే
నేవగి నేర్పరింపఁదగు
నింగితముం గన్నైతి నెల్లర
త్యావిలనూత్న నాగరిక
తాసమభాసితులై చరింపుటన్ ॥ ౧

ధనసంతుల్ తరుణీజితుల్ పలు జనిం
దారుల్ రతీశాశ్రితుల్
ధనకాంతాతతి నియ్యెడన్నిలిపి మ
ద్రాసందుఁ జారుండుచున్
జనకుల్ తాతలుఁబంపు విత్తముల ని
చ్చ స్వేచ్ఛముం జేయుచున్
మనభోగంబులుగాంచి మాయుదురు, 'బా
క్యాపక్కిరుల్'గాఁ దుదిన్ ॥ ౨

అరియ క్షేత్రరాజముల
యం దెవనింతక్కు రదేమి కర్మమో ?
రలు ; వారివ ర్తకము
సాగెడి పట్టులటంచునో, మహా

దాసుల భక్తులం గలయ
నబ్బును భుక్తియు ముక్తి యంచునో,
తారొసరించు దుష్కృతులు
దైవము సన్నిధిఁ బోవునంచునో ॥ ౩

---

# కవి — కవిత

ప్రకృతి సౌందర్య ధుర్యప్రపంచంబెల్ల
నాస్థానమండపమై వెలుంగ,
నమృతకోమల కవిత్వ మహత్త్వమే రమ్య
సింహాసనంబయి చెలువుగూర్ప,
నపరసాంచితభావ నవ్యపోషణములు
సాచివ్య సాహాయ్య సమితిగాఁగ,
నృత్త జాత్యుపజాతి వివిధ గేయంబులు
చతురుపాయములయి జాలువాఱ
సరస సాహిత్య సామ్రాజ్య చక్రవర్తి
పదవుఁగాంచిన నీవహో భాగ్యశాలి
ననని పతులెల్ల నీయడ్గు లాశ్రయించి
యమర జీవనమును గందురయ్య! సుకవి ॥ ౧

భాషాకింకిణీ నిక్వాణంబౌలయ నీ
భావంబులం బాడుచుఁ
'ఘోషా'—వీడి నటించు నీకవిత ని
గ్గుల్ చూచి హర్షించ కం

దేశా' చేసిరి నేఁటివారలని, యా
త్రింగూర నీకేల ? 'నా
మోషీ' వారికెగాని, నీ యమృత వా
గ్భాషల్ బుధస్తవ్యముల్ ॥ ౨

'ఎవరెస్టై'యినను నెక్కఁగల్గు, 'పసిఫి'
క్కేనిం బ్రవేశించు, నా
భ్రువలోకాంతరమందుఁ జేరు, 'నమెజా౯'
దూఱు౯, 'సహారా'స్థలం
బవలోకించును, 'ఎక్సురే'కనని జీ
వాంతార్గతార్థంబు నే
నవలీలం గనిపట్టు, నీనిశిత భా
వాంశుద్యుతుల్ సత్కవీ ! ॥ ౩

భావలతా ప్రఫుల్ల సుమ
బంధురగుచ్ఛము లెల్లదిక్కుల౯
దాపులు చిమ్మఁగాఁ గపులు
దారతఁ జల్లిరి, సేకరిం, పుపే
క్షావిధిమాని, మాలికలు
గా నొనరింపుము, పత్రిసంపుటి
న్నివవి దాఁచికొమ్ము, చెడ
నేరని సొమ్ములు సుమ్ము, తమ్ముఁడా ! ॥ ౪

భావదరిద్రతాంబునిధి
భంగములం బొరలాడు కాకవుల్
కేవల మెర్వసామ్ముల బి
గించి, విరూపకృతి ప్రసూతలన్
జీవిత నాట్యరంగమునఁ
జిందులు ద్రొక్కఁగఁ జేయుచో, రస
జ్ఞీవుల మోము మొత్తదె ?, వి
శీర్ణముగాదె ? కళాస్వరూపమున్ ॥ ౫

ప్రకృతివైచిత్ర్య భావధారా నిశితము,
లలితపదజాల లోహసంకలితము, నగు
సత్యవిత్త్వాసిపుత్రి పుస్తకపుటాజను
గలుగు నీకు దిగ్విజయము కవివరేణ్య ! ॥ ౬

(మాతృసేవ : నందన ఉగాదిసంచిక)

